# శ్రీ వల్లూరమ్మ చరిత్ర

( భజన పాటలు )




రచన :

గంగిశెట్టి నరసింహారావు HSC (BA) CLSC

సంపాదకుడు :

ఏ. కోటేశ్వరరావు టీచరు

ప్రతులు : 500

ప్రచురణ నెం. 2 : 1992

వెల : రు. 5-00

Rs - 9 00

ప్రతులకు :

1) శ్రీ ఎ. కోటేశ్వరరావు టీచరు
వల్లూరు పోస్టు, ప్రకాశంజిల్లా.

2) శ్రీ జి. రామాంజనేయులు
C/o శాఖా గ్రంథాలయము
మద్దిపాడు or ఉలవపాడు పోస్టు
ప్రకాశం జిల్లా.

ముద్రణ :
జి. బి. ప్రింటర్స్
విజయవాడ-2



ఉలవపాడు శాఖా గ్రంథాలయమునకు 2-3-1986 న వచ్చి దాతలను ప్రోత్సహించి, పాఠకుల సౌకర్యార్థము పలు అభివృద్ధి కార్యక్రమములు చేయుచున్నప్పుడు, మేము చెప్పినట్లు వినటంలేదని ఒంగోలులో ఉన్న మీడియేటర్స్ నన్ను గుర్తించటంలేదని ఉలవపాడులో ఉన్న ఓ నాయకుడు ప్ర॥ జి॥ గ్రం॥ సంస్థ చైర్మన్ (22-6-1988) శ్రీ అంజయ్య గారికి చెప్పి నన్ను సి.యస్. పురం బదిలీ చేయించారు.

గ్రామంలో ఉన్న అన్ని వర్గముల వారును ఉపాధ్యాయులు, ఉద్యోగులు, విద్యార్థులు నిలుపుటకు ప్రయత్నించినను ఫలితము కల్గుగ లేదు. శుక్ర- సెలవు రోజులలో శ్రీ వల్లూరమ్మ తల్లిని నమ్ముకొని, అనేక పర్యాయములు దర్శించుట చేత ది. 1-7-89 న వలేటివారిపాలెం బదిలి చేశారు. అక్కడ పనిచేయుచుండగ చైర్మన్ శ్రీ అంజయ్యగారి "తొలి వసంత ప్రగతి" పుస్తకము తయారు చేయుట జరిగింది. ఆ సందర్భముగా అమ్మవారి చరిత్ర కొంత సేకరించుట జరిగింది.

వల్లూరునివాసి, ఆధ్యాత్మిక చింతనాపరులు, ఉదార స్వభావులు, మిత్రులు శ్రీ ఎ. కోటేశ్వరరావుగారితో సంప్రదించగా వారు తగిన సహకారము అందించుటకు ముందుకు వచ్చారు. వల్లూరు నివాసులు కరణీకులు, అమ్మవారి వేడుకలు తెలిసిన శ్రీ టంగుటూరి కోదండ మూర్తి పంతులుగారి వద్దనుండి కొంత సేకరించటం జరిగింది.

అమ్మవారితో సంబంధం కలిగిన హైదరాబాదులోగల శ్రీ అద్దంకి సూర్యనారాయణశర్మగారికి వ్రాయగా, వారు కొంత స్థల పురాణము తెల్పియున్నారు. ఈతముక్కల శ్రీ జ్వాలమ్మ విషయము వయో వృద్ధులు- మదనూరు వాసి శ్రీ లింగారెడ్డి జాలిరెడ్డిగారు కొంత వివరించారు. పూజారులలో ఒకరైన శ్రీ విశ్వంగారు "శ్రీ అల్లూరు రామ

కృష్ణయ్యగారు వ్రాసిన "తరికొండ జ్వాలాముఖి" అమ్మవారి పుస్తకము అందజేశారు.

మరొక పూజారయిన శ్రీ గూడల కృష్ణమూర్తిగారు, శ్రీ సోమ రాజుపల్లి నాగేశ్వరరావుగారు, శ్రీ సింహాద్రి పంతులు, శ్రీ చిరుమామిళ్ళ సుబ్బారావుగారు కొన్ని విషయములు అందించారు. గుడ్లూరు లైబ్రేరియన్, మిత్రులు శ్రీ కృష్ణమూర్తిగారు మందపాటి రాజాలకు సంబంధించిన "శ్రీరామచంద్ర విజయము" అందించారు.

అడిగిన వెంటనే తగిన సూచనలు- సలహాలు అందించిన ఒంగోలు అసిస్టెంటు కమీషనరు శ్రీ జి. అనంత నారాయణగారు, అక్కడ పని చేయుచున్న కార్యనిర్వాహణాధికారి శ్రీ యడవల్లి శేషయ్యగారు, వల్లూరు నివాసులు, ఆధ్యాత్మిక చింతనాపరులు డా॥ వెంకటేశ్వరరావు యాదవ్ గారు, మరి అనేకమంది ముఖ్యులు సహకరించిన విషయము మరువ రానిది.

ఏదైన లోపములున్నచో పెద్దలు సహృదయముతో తెలియపరచ గలందులకు ప్రార్థించుచున్నాను. అమ్మవారి చరిత్ర, మహిమలు విని నను, చూచినను, చదివినను ఆయురారోగ్య ఐశ్వర్యములు కలుగుచున్న వని తెలియజేయుటకు ఎట్టి సందేహము లేదు.

ఉలవపాడు — జి. నరశింహారావు

8-1-1992 — రచయిత

# ఆశీస్సులు

## అద్దంకి
## సూర్యనారాయణశర్మ

ఇ. నెం. 2–51 వీధి నెం. 1, వాణీనగర్,
మల్కాజిగిరి, హైదరాబాదు-47

శ్రీయుత నరసింహారావుకు, ఉభయకుశలోపరి.

శ్రీ వల్లూరమ్మను గురించి తెలుపవలసినదిగా వ్రాసియున్నారు. చాలా సంతోషము మా పెద్దలు చెప్పుకొను మాటలనుబట్టి ఒంగోలు మందపాటి రాజులకును- వెంకటగిరి సంస్థానము వారికిని తరచు తగాదాలు జరుగుచుండెడివని దాని నివారణకు మా వంశములో గల దేవి ఉపాసకులు శాక్తేయుదు, బ్రహ్మచారి అయిన అద్దంకి రామచంద్రయ్య సహకారముతో శ్రీ మందపాటి రాజుల తరపున మహాయజ్ఞం చేసి, శ్రీ బరూరి నరసింహ యోగీంద్రులవారి ఆధ్వర్యములో శ్రీ జ్వాలాముఖి అమ్మవారితో బాటు శ్రీ వల్లూరమ్మ కూడా ఉద్భవించిందని వివరించబడింది.

"ఉల్కాముఖి" పేర వల్లూరులో అనాది కాలం నుండి గ్రామదేవతగా ప్రజలను కాపాడుతూ వస్తుంది. మా పూర్వీకుల పెత్తనములో 1770 లో అమ్మవారి ప్రతిష్ఠ, ఆలయ నిర్మాణము జరిగిందని గర్భగుడి పైభాగమున బండపై శాసనం చెక్కి యున్నారు. నేను ఉద్యోగ రీత్యా ఊరు వదలి వెళ్ళునప్పుడు మా ఇంటిని అమ్మవారికి ఉచితముగా ఇచ్చివేసినాను ప్రస్తుతము శ్రీ గూడల శేషయ్య కుమారులు ఉంటున్నారు.

దసరా ఉత్సవము లందు అమ్మవారి వేడుకలకు ఉదారంగా పదివేల రూపాయలు (10,000/-) అందించాను. యింకా వివరములు కొరకు సోమరాజుపల్లి నాగేశ్వరరావుగారిని, మదనూరు లింగారెడ్డి జ్వాలారెడ్డిగారిని అడిగి తెలుసుకొనవచ్చును. అమ్మవారి దయవల్ల మీ కృషి ఫలిస్తుందని, నా ఆశీస్సులు అందజేయుచున్నాను.



# మనసులో మాట

డా॥ అంగిరేకుల
వెంకటేశ్వరరావు
ఎ.బి.బి.యస్.

శ్రీ వెం॥ర హాస్పటల్, ట్రంకురోడ్డు,
టంగుటూరు

వీరు శ్రీ వల్లూరమ్మ చరిత్ర వ్రాశారు. ఒకసారి చూడవలసినదిగా మిత్రులు శ్రీ కోటేశ్వరరావుతో వచ్చారు. మా కాలంలో ఇలా జరిగింది, అలా జరిగిందని పెద్దలు చెపుతుంటే వింటున్నామే కాని,వాస్తవం తెలియదు మీరు శ్రమపడి వ్రాసినందుకు అభినందలు తెలుపవలసివుంది.

ఒక కార్యము తలపెట్టినప్పుడు వ్యయ ప్రయాసలుతో గాని జయప్రదము కాదు. దానికి విశ్వాసము పట్టుదల వుండాలి. రచయితకి అమ్మవారిపై భక్తి భావము కలుగుటకు గల కారణములు తెలుసుకున్నాను. చాలా సంతోషము. అయితే చరితకు సంబంధించిన ఆధారములు రికార్డు పూర్వకముగా వుంటే బాగుంటుందని సలహా ఇచ్చాను. 300సం॥ల పైబడిన చరిత్రకు ఆధారములు అన్నియు లేకున్నా శ్రమపడి కొంతవరకు వాస్తవ గాధలను సేకరించుటలో విజయం సాధించారని చెప్పక తప్పదు. అమ్మవారిపై కొన్ని శ్లోకములు పొందుపరచవలసినదిగా సూచించాను. పాత పద్దతులు (జంతు బలి) విడనాడవలసివున్నది. పాత జ్ఞాపకాలు మరుగున పడిపోకుండా ముందు తరాల వారికి అమ్మవారి చరిత్ర అందించటం అమోఘం. భవిష్యత్తులో ప్రయోజనకారి కాగలిగితే వీరి ప్రయత్నం ఫలించినట్లే. భగవద్భక్తికి ఇది తోడ్పడగలదని ఆశిస్తున్నాను. రచయితకు శక్తి సామర్థ్యములు ఆయురారోగ్య ఐశ్వర్యములు అమ్మవారు ప్రసాదించాలని తలంచుచున్నాను. సంపాదకుడికి నా ధన్యవాదములు.

టంగుటూరు — డా॥ ఎ. వెంకటేశ్వరరావు యాదవ్

# అమ్మవారు!

పెల్లూరమ్మవారు కూర్చుంటే
కుందనపు బొమ్మలాగే ఉంటుంది.
ఆ బొమ్మ చూస్తుంటే-
బంగరు బొమ్మలాగే ఉంటుంది.
అందాలు చిందించు మందహాసము
ఆ మోము అగుపించు చంద్రబింబము
చంద్రుడ్ని దిక్కరించు నొసటి తిలకము
ఆ తిలకమే కనులకు ఇహపర సుఖము ॥అమ్మ॥

వేడుక పండుగలు—ఉత్సవాలూ
చండిగాను దూప దీప నైవేద్యములు
చిందారగిస్తుంది మన చిట్టితల్లి
మన కంటి పాపాయి మన కల్పవల్లి ॥అమ్మ॥

ఇంటింట వెలిసింది మహాలక్ష్మి తల్లి
అంతట వెలసింది శుభలక్ష్మి తల్లి
ఆరోగ్యం ఐశ్వర్యం కలిగిస్తుంది తల్లి
సంతానం సౌభాగ్యం కలిగిస్తుంది మళ్ళి

[illegible]ంగుటూరు —శివచరణస్వామి



# అంకితం

## శ్రీ బెజవాడ వెంకటేశ్వర్లు, బి. ఎ.

విజయ టుబాకో ఎంటర్‌ప్రైజెస్ అధినేత

టంగుటూరు

"కవిని గన్న తల్లి గర్భంబు ధన్యంబు
కృతిని పొందువాడు మృతుడు కాడు"

వీరు 1-6-1952 లో టంగుటూరులో జన్మించి, పూనాటి మందయ్య - పార్వతమ్మలకు పుత్రుడై మెలగుచున్నారు. చిన్నతనము నుండి స్నేహితులన్నా, సాహిత్య కళా రంగములో ఉన్నతుడుగా నుండెడివాడు.

వీరు వ్యాపారములో అనుభవము పొంది అనేకమందికి సహాయ సహకారములు అందించిన ఆదర్శవంతుడు. పేద విద్యార్థులకు సహాయ మందించుటయే గాక, బడికి, గుడికి సహాయ సహకారములు అందించిన వాడు.

కార్మికుల శ్రేయస్సుకు తోడ్పడుతున్న నిరాడంబరుడైన మానవతావాది. శ్రీ వల్లారమ్మ చరిత్రకు కొంత ఆర్థిక సహాయ మందించిన ఉదార స్వభావులు. సత్కార్యములకు చేదోడుగా నుండువాడు.

అట్టి ఉత్తమునికి అమ్మవారు ఆయురారోగ్య భాగ్యములు ప్రసాదించుగాక అని వేడుకొంటున్నాము.

ఎ. కోటేశ్వరరావు
సంపాదకుడు

# శ్రీ వల్లూరమ్మ చరిత్ర

॥సర్వమంగళ మాంగళ్యే-శివే సర్వార్థ సాదకే
చరణ్యే త్రియంబకె-గౌరి నారాయణీనమోస్తుతే॥

## ఊరు-పేరు :

మానవ ప్రపంచములో మనకు పేరులేని ఊరుగాని, వస్తువుగాని, మనిషిగాని సహజముగా ఉండదు. మానవమనుగడకు యీ పేరులు ముఖ్యాధారములు.

ఒక శక్తికిగాని, వ్యక్తికి గాని, కులానికి గాని, స్థలానికి గాని, ఏదో ఒక పేరు ప్రతిదానికి పెట్టడమనేది-మన తాతముత్తాతల దగ్గర నుండి వినిపిస్తున్న, కనిపిస్తున్న ఆచారము. ఉదా॥కు వావిళ్ళ వారి నిఘంటువులో ప్రదమ సంపుటం పుట 290లో "ఊరి పేరింటి పేరుగా నొప్పు నాకు" అని వుంద.

తెలుగులో ఇంటిపేర్లను గమనించినచో వాటిలో గ్రామ నామము లను బట్టి కూడా కన్పించుచున్నవి. పూర్వపు ప్రజల ఆచార వ్యవహార ములు, వృత్తి ప్రవృత్తులను, నైసర్గిక- చారిత్రక, మతసంబంధమైన సామాజిక పరిస్థితులను బట్టి కూడ గ్రామనామములు ఏర్పడినవి.

పూర్వపు ప్రజలు ఏయే ప్రాంతములలో నివశించినారో, జీవించి నారో, తర్వాత కాలానుగుణముగా ఏయే ప్రాంతములకు వలస వెళ్ళారో

తెలుసుకొనుటకు కాలెనే మెకంజీ దొర(1754-1821) కావలి బొర్రయ్య వారి సోదరుల ద్వారా సేకరించిన గ్రామ కైఫీయతులు మనకు నేడు ఆధారములు ఉపయోగపడుచున్నవి.

ఉదాహరణకు ఊరు, వాడ, పల్లె, పాళెం, పాడు, పట్నం, పురం, కొలను, కుంట, కోట, కొండ, తదితరసంబంధమైన పదములు వందలు, వేల సంఖ్యలో గ్రామనామములుగా విన్పించుచున్నవి. ఈ ఊరులోని పర్యాయములే వల్లూరు, పెళ్ళూరు, కల్లూరు, నెల్లూరు, పావులూరు, పలుకూరు, గుంటూరు.

చెదలవాడ, విజయవాడ, గుండ్లాపల్లి, వెల్లంపల్లి' నాగన్నపాలెం, రాచవారిపాళెం, బసవన్న పాళెం.

A. స్థలనామములనుబట్టి వ్యక్తి నామములు ఏర్పడినవి.

ఉదా॥ తిరుపతి, సింహాచలం, మాలకొండ, ఏడుకొండలు.

B. వ్యక్తి నామములను బట్టి స్థలనామములు ఏర్పడినవి.

ఉదా॥ చెన్నప్పనాయనింవారి పేర-చెన్నపట్నం మదరేషన్ అను వ్యక్తిపేర-మద్రాసు.

బందాపరదేశి మంత్రి గృహనామమే బందరు పెన్నానది దరినున్నందున (అనంతపురం) పెన్నదరి.

C. ఇంటిపేరును బట్టి (వంశ) గ్రామనామములు కూడా ఏర్పడినవి.

ఉదా॥ వల్లూరి వారి అగ్రహారము.

మద్దిపాటివారి అగ్రహారము. టంగుటూరి వంశ నామమున టంగుటూరు, గుండ్లాపల్లి, వెల్లంపల్లి.

D పదవులు-బిరుదములు బట్టి కూడా గ్రామనామము లేర్పడినవి.

ఉదా॥ కాకతీయ గణపతి తన దగ్గరగల లక్షణ కవికి గౌరవముగా ఇవ్వబడిన అగ్రహారమే గణపతివరం - గణపవరం, గణపారం.

నందుని వద్ద అగ్రహారము బడయుటచేత నందునివరం-నంద వరం - నందారంగారాయన భాస్కరుడు ఏర్పరచినట్లు చెప్పబడు తుంది.

చంద్రశేఖరుని ఇలవేల్పుగా ప్రతిష్టించిన స్థలమే సి.యస్.పురం ప్రకాశం జిల్లా.

ఇలా ఒక్కొక్కక్క సందర్భంలో కాలమానపరిస్థితుల వలన గ్రామనామములు ఏర్పడినట్లు- మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండా గారములో అక్షరక్రమములో డెబ్బది దాకా వాల్యూమ్స్ గలవు. విదేశా లలో కూడా మన దేశం పేరు కొన్ని చోట్ల గలదనుటకు యీ దిగువ ఉదాహరణము గలదు. ఇండోనేషియా దేశస్థుడు ఒంగోలు జాతి ఎద్దు లను దిగుమతి చేసుకొని, వ్యాపారము చేయు ప్రదేశమును ఒంగోల్ ఐలాండ్ (ONGCLE ISLAND) అని నేటికి పిలువబడు చున్నది.

అయితే కొన్ని సమయములలో వరదలు - తుపానులవలన, రాజుల దండయాత్ర—దారిదోపిడీల వలన పలుగ్రామములు పాడుపడి పోయి, జన సంచారములేక బీడులుగా, ఎడారులుగా, మారిన సంఘటి నలుకూడా గలవు.

అటువంటి గ్రామములలో ప్రస్తుతము మన చరిత్రకు సంబంధిం చిన వల్లూరు గ్రామము ఒకటి.

## వల్లూరు :

వల్లూరు పూర్వనామము "పాములపాటి" ఈ పాటిమీద పాములు తేళ్ళు, జెర్రులు, మండ్రగబ్బలు తదితర సంబంధమైన విషపురుగులు పగలు రాత్రనక—తిరుగుచూ, భయంకరముగా బాటలకు గురిచేస్తుండే వని తెలియుచున్నది. చుట్టూ చిల్ల చెట్లకు, ముళ్ళపొదలకు నిలయమైన ప్రదేశము.

విజయనగరపు కడపటి రాజుల కొలువులో మంత్రులుగా, సేనానాయకులుగా, ముఖ్యసలహాదారులుగా ఉండి, గ్రామపరిపాలనలోను దేశ వ్యవహారములలోను సహాయపడుచుండుట చేత వారు నివసించుటకు ఆయా ప్రాంతములలో అగ్రహారములు దానములుగా యిచ్చిన ఉదంతములు గలవు.

వీరు చేయుచున్న పదవులనుబట్టి, రాజు తర్వాత రాజంతటి గౌరవమును పొందుచుండిరి. రాజులు వారితో నమ్మకము కలిగి గ్రామ అంతరంగిక వ్యవహారములు ఎప్పటి కప్పుడు తెలుసుకొనుచుండెడివారు .ఆయా ప్రాంతపు రాజోద్యోగుల సలహా సంప్రదింపులను బట్టి కూడా రాజులు నడుచుకొనుచుండెడివారు రాజులనుమెప్పించి, ఒప్పించి, అగ్రహారములు, ఆధిపత్యము, బిరుదములు పొందిన సంఘటనలు గలవు.

గ్రామ పరిపాలనలోను, దేశ వ్యవహారములలో నియమించుటచేత కొందరు—నియోగులైనారు. ఆగమ శాస్త్రము తెలిసియుండి, పురాణాది వేదములు చెప్పుటచేత మరి కొందరు వైదికులైనారు. అట్టివారికి అగ్రహారములు ఇచ్చి గ్రామ కరిణీకులుగాను, పెత్తందారులుగాను, సలహాదారులుగాను వ్యవహరించుటకు వీలు కల్పించిరి. అట్టి బ్రాహ్మణులలో వల్లూరి వంశజులు ఒకరు. వారిని ఊరాగ్రహారముగా యీపాటి మీద నివసించుటకు తగిన వసతులు కల్పించుటచేత వల్లూరివారి అగ్రహారముగా పిలువబడినది.

ఈ వల్లూరివారి అగ్రహారము లేక వల్లూరు గ్రామనామము మెకంజీదొర సేకరించిన గ్రామకైఫీయతులలో స్పష్టముగా కన్పించుచున్నవి. వేటపాలెం శ్రీ సారస్వతనికేతనం గ్రంథాలయంలో గల శ్రీ వల్లూరి సూర్యనారాయణరావుగారి స్వీయచరిత్ర వలన కొంత తెలియగలదు

వీరు ఆర్వేల నియోగులని కూడా చెప్పబడి యున్నది. వీరు గ్రామములో, పరిసరప్రాంతములలో జరుగు విషయములు, పన్నులు, రాచకార్యములు పైవారికి విన్నవించటము, వారి సూచనలను, సలహా

లను ప్రజలకు అందజేసి, తగిన విధముగా నడుచుకొనుటకు కృషిచేయటం జరుగుచుండేది. గ్రామములలోని సమస్యలను పరిష్కరించెడివారు.

## చెఱువులు :

వర్షములు లేక పంటలురాక ప్రజలకు తిండికి కరువై వలస వెళ్ళుచున్నప్పుడు రాజులతో సంప్రదించి, ఆనాటి పెత్తందారులు హరిహర, బుక్కరాయలవారి సహాయ సహకారములతో రామలక్ష్మణులాంటి వల్లూరు - పెళ్ళూరు చెరువులను త్రవ్వించారని తెలియుచున్నది.

సోమశేఖరుడు స్వయంభువుగా యీ ప్రాంతములో వెలయుటచేత "సోమవరప్పాడు" అని ప్రదేశము కూడా గలదని తెలియుచున్నది. మొత్తము పై వల్లూరు వంశజులు అగ్రహారీకులై నివశించుటచేత యీ గ్రామమునకు వల్లూరను పేరు ప్రసిద్ధిచెందినదిగా పూర్వీకులవాదన.

## మందపాటి రాజులు :

విజయనగర రాజుల అనంతరం మహమ్మదీయులు మన దేశమును పరిపాలించుచుండిరి. పాలెగాండ్రు స్వతంత్రులై అక్కడక్కడ రాజ్య పాలన సాగించుచుండిరి.

అట్టి వారిలో వంగోల్ - పెళ్ళూరుకు మందపాటివారు, గుడ్లూరుకు వేజర్లవారు, వెంకటగిరికి వెలుగోటివారు సంస్థానాధిపతులై రాజ్యవాప్తికై పోరాటములు సాగించుచుండిరి. మందపాటి రాజులు పెళ్ళూరుకు పశ్చిమమున గల ఎండ్లూరు (ఎరజర్ల) ప్రభువులు. రామభద్రరాజు- రామచంద్రరాజు అన్నదమ్ములు.

రామచంద్రరాజు వంగోల్‌కు ప్రభువు. వీరి మంత్రి మహావీరుడైన ఖానోజీ. ఆ రోజులలో బలవంతులు తక్కువ బలముగల వారిపై దండెత్తి దోచుకొనుచుండెడివారు. దానివలన మండలాధీశులకు, ప్రజ

లకు నష్టము- కష్టము కలుగుచుండెడిది. ఇది గమనించిన మందపాటి రాజులు పెళ్ళూరులో శత్రువులకు చలించని బలమైన, దృఢమైన కోటని నిర్మించి పరిపాలన సాగించుచుండిరి.

వీరు గోల్కొండ-హైదరాబాదు నవాబుల కాలములో కప్పము (పన్నులు) సకాలములో వసూలు చేసి, చెల్లించేవారు. నవాబు జరిపించు సభలకు ఒకరిద్దరు ఆయా సంస్థానముల నుండి వెళ్ళెదరు. అక్కడ ఆయా మండములలోగల సమస్యలు, పరిస్థితులు నవాబు కెరిగింతురు. నవాబువారు ఆదేశించిన పర్మనాను గ్రామములలో అమలు చేయుదురు.

ఒక్కొక్కసారి నవాబువారు ఆదేశించిన సాహసోపేత భయంకరమైన పనులు నిర్వహించి వారిచేత బిరుదములు, సత్కారములు పొందుచుందురు.

అట్టి సందర్భంలో చీమకుర్తికొండ పరిసర ప్రాంతపు అడవులలో ఒక భయంకరమైన పులిని చంపుటకు సాహసోతులైన సంస్థానధీశులకు పర్మనా విధించారు. దానికి రామచంద్రరాజు అంగీకరించి తిరిగి వచ్చారు.

ఒక ప్రక్క సైన్యాధిపతులను చూస్తుండమని మరోప్రక్క మాటువేసి చాకచక్యముగా వెంటాడి పులిని చంపెను. ప్రజలకు గల భయాందోళనములను తొలగించెను. "కలియుగ భీముడన్" ప్రజలు మెచ్చిరి. హైదరాబాదు నవాబు వీరిని పులిపించి, "దేశపాండ్య" బిరుదు నిచ్చి సత్కరించెను. తెట్టు ప్రభువు వెజళ్ళ వెంకట నారాయణరాజు తన కుమార్తె అచ్చమాదేవి నిచ్చి వివాహాము జరిపించెను. ఈమె కూడ వీర వనిత.

అంతేకాదు నవాబుగారి మదపుటేగును లొంగదీసి దానిని వశము చేసుకొని జయించిన ఉక్కు మనిషి. సంతరావూరును స్వంతముగా వేలు బడి క్రింద ఇనాంమానము పొందియుండెను.

"వంగోల్ రాజ్యలక్ష్మితో వానికెక్క
భీమబలుడన శూరత వెలసినట్టి
మందపాటి కులాబ్ధి సోమసముద్రైన
రామచంద్రుడన్ రాజుండు రహిఁ జెలంగ"

అనేక సాహసోపేతములైన కార్యములు జేసి ప్రతిభావంతులుగా ప్రసిద్ధి పొందిరి దాస గుణశీలములో యశస్సు వ్యాప్తి చెందెను. విశేష అనుభవము గలరు. ఒకరికి తల వంచని వీరులు శూరులు.

## వెంకటగిరి సంస్థానము-వెలుగోటి వంశజులు :

విజయనగర రాజుల ఆనంతరము రాజ్య వ్యాప్తికై పోరాడి, స్వతంత్రించిన సంస్థానములలో వెంకటగిరి రేచర్ల వెలమ నాయకులు ఒకరు

వెలుగోటి వంశజులు వెంకటగిరి ప్రభువు బంగారు యాచమ నాయనింగారు.

వీరి మంత్రివర్యులు రామయ్య. ఆర్థికముగా, అంగబలములోను ఎక్కువ అవకాశము గలవారు. వీరికి కావేరి సమీప పాలకులు దామచర్ల వారు బంధువులు. దామచర్లవారు కంచి నుండి కాళహస్తి వరకు పరిపాలించుచుండిరి.

వర్తక నెపముతో వచ్చిన తెల్లవారు మనలో మనకు తగవులు పెట్టి, యుద్ధములు చేయించి, ఒకరిపై ఒకరు ద్వేషములు కలుగునట్లు చేసిరి. పట్టుదలకు మారు పేరు వెంకటగిరి వారు.

తెలుగురాజుల దయవలన తెల్లవారు పలుచోట్ల కోటలుకట్టి ఫిరంగులు నిలిపారు ఒక ఫిరంగి ప్రేలితే దాని గుండు వెళ్ళి వెంకటగిరి సంస్థానము ఎలుబడిలో పడింది. అక్కడ కూడా కోట నిర్మించాలని ఇంగ్లీషువారు విశ్వ ప్రయత్నము చేశారు. దానికి వెలుగోటి బంగారు నాయనింగారు సుతరాము ఒప్పుకొన లేదు. బ్రిటిషువారు ఆర్థికముగా, అంగబలము కలిగియున్నందున వెంకటగిరి వారిని ఏమీ చేయలేక

వదిలి వేశారు. వెంకటగిరివారికి పలు గ్రామములపై అధికారము గలదు.

## ఒక వరలో రెండు కత్తులు ఇమడవు :

ఆర్థిక బలము-అంగబలము గల వెంకటగిరివారికి, ధైర్య సాహసోపేతములుగల పెళ్ళూరు రాజులంటే మొదటి నుండి గిట్టదు. కాని వారు కొందరు, కావాలని మరికొందరు ఇరు వర్గాల వారికి కలహములు పెట్టుచుండిరి. పెత్తనము విషయములోను, పరిపాలన విషయములోను ఒకరికొకరికి పడుచుండెడిది కాదు. ఈర్ష్యా ద్వేషాలు పెంచుకొనడం, చిన్న చిన్న తగాదాలు పెట్టుకొని ఘర్షణకు దిగటం జరుగుచుండేది.

ఒకసారి తమకు రావలసిన కప్పమును (పన్ను) చెల్లించ వలసినదిగా తమ అంతరంగిక ఉద్యోగి గువ్వల తిరువెంగళాన్ని పంపగా "బలహీనులుగా ఉన్నవారికి బోడి పెత్తనమా" అంటూ వచ్చినవాడి తల నరికి, తన సైన్యాధికారిలో ఒకరిని మందపాటి రాజుల వద్దకు పంపించెను.

తన ఉద్యోగి తల నరికి తనవారి సంస్థానమునకు బహుమానముగా పంపినందుకు కలతచెంది రామచంద్రరాజు వెంకటగిరి వారికి కనువిప్పు కలిగింప ప్రత్యుపకారము చేయ తలంచెను. రామచంద్రప్ప రాజంటే వెంకటగిరివారికి భయమే.

వచ్చిన వెంకటగిరి సైన్యాధికారి మెడలో బలమైన, దృఢమైన ఇనుప గడ్డపలుగు మెలివేసి "మీ రాజు మొనగాడైతే- యీ గడ్డపలుగు మెలితీసి పంపమని సవాలు చేసి, వాడిని వెంకటగిరికి సాగనంపెను. విషయము తెలుసుకున్న వెంకటగిరివారు పరాభవముతో మిన్నకుండిరి. పెళ్ళూరివారిపై కుట్ర చేయసాగిరి.

## నల్లవాగు :

తెట్టులోగల భయంకరమైన పులిని చంపుటకై మేనమామ, తెట్టు

ప్రభువు వేజళ్ళ వెంకటనారాయణరాజుగారి ఆహ్వానముపై "దేశపాండ్య" రామచంద్రప్పరాజు బయలుదేరుతున్నాడని తెలిసి వెంకటగిరి రాజా వారు సైన్యమును తగినంతగా పంపి, హతమార్చ వలసినదిగా ఆదే శించెను.

వెంకటగిరి సైన్యము వల్లూరు-పెళ్ళూరు మధ్య నల్లమందుతో పల్లపు ప్రాంతము వాగులో కాపువేసియుండిరి. విధివశాత్తు సైన్యాధ్యక్షుడు బాలాజీ పల్లపు ప్రాంతమునకు రాగా, నల్లమందు తుపాకి దెబ్బలకు అసువులు బొందెను. ఈ ఘోర ప్రమాదము జరిగినచోటునే నేడు నల్ల వాగు అని పిలువబడుచున్నారు.

విషయము తెలిసిన రామచంద్రప్పరాజు నాయుడుపాలెం కోనేటి సెంటరులో కొందరిని ఆటకాయించి, కోటలో బంధించిరి. బలము తక్కువయినప్పటికి తెలివితేటలతో చాకచక్యముగా మందపాటి రాజులు ఏదో విధముగా వెంకటగిరిరాజులను ఎదుర్కొనుట జరుగుచుండేది. ఇది వెంకటగిరి వారికి అవమానముగాను, తల నొప్పిగాను తలంచుచుండిరి. వీలు దొరికినప్పుడు ఏదో విధముగా మందపాటి వారిని హతమార్చి, రాజ్యమును కైవస చేసుకొనవలెనని తలంచుచుండిరి. అందుకు తగిన యుద్ధ సన్నాహములు కూడా చేయుచున్నారని చారుల వలన తెలియు చుండెడిది.

## దండుబాట :

సంస్థాముల పరిపాలన సందర్భంలో, రోడ్లుగాని, రవాణా సౌక ర్యములుగాని సరిగా వుండేవి కావు. కాలిబాటలు మాత్రము ఎక్కువగా ఎక్కడపడితే అక్కడ వుండేవి.అయితే రాజకార్యమునిమిత్తం సైన్యము, రధములు, ఏనుగులు, ఒంటెలు బయలుదేరుటకు విశాలమైన మట్టి బాటలు ఏర్పరచబడి యుండేవి క్రోసు—ఆమడ-మరికొంతదూరము పోతే, అక్కడ మర్రిచెట్లు లేక చింతచెట్లు ఏర్పాటుచేసేవారు. వాటికి దాపులో కుంట లేక చెరువు త్రవ్వబడియుండును. వాటినే కోనేరు అని కూడా అందురు త్రాగునీటికి ఉపయోగపడుచుండేది.

రాజుగాని, మంత్రులుగాని సైన్యము రాచకార్యముల నిమిత్తం ఇతర ప్రాంతములకు పోవునప్పుడు ఈ ప్రదేశములలో విశ్రాంతి పొందుటకు ఉపయోగపడుచుండును. అధికారులు జోడుగుర్రములపై పయనించెదరు పదాతి సైన్యము భటులు కాలినడకన దండుగా వెడలుచుందురు. అందువలన ఈ మార్గమును దండుబాట అనుచుండెడివారు. దీనికి ఇరుప్రక్కల విశాలముగా నాగజెముడులేక కలబంద నాటబడియుండును. ఈ బాటలద్వారా ఏనుగులు, ఒంటెలు, ఇతర వాహనములు అనేకమంది సైన్య సమేతముగా పోవుదురు.

వెంకటగిరి రాజా వారిమంతులు-సైన్య సమేతముగా ఈ దండుబాటగుండా వెళ్ళి, కారంచేడు, స్వర్ణలో కప్పము చెల్లించుకొని, తిరిగి వచ్చుచున్నప్పుడు వంగోలు దాటిన తర్వాత పెళ్ళూరు సంస్థానము పంట పొలములలోపడి, గుర్రములు, ఏనుగులు, సైన్యము పైరులను నాశనముచేసి అపార నష్టమును కలిగించినట్లు—తెలుసుకొని, మంద పాటి రాజుల సైన్యము "ఇదేమిపని అని అడుగగా" వెంకటగిరి సైన్యములోని కొందరు జగడమునకు దిగిరి. గొడవలు కలుగజేసుకొని ఘర్షణకు పూనుకొనిరి.

విషయము తెలుసుకన్న పెళ్ళూరు రాజులు ఆగ్రహించి, వెంకటగిరి రాజావారి సైన్యమును, ఏనుగులను, గుర్రములను కట్టివేయించి, కొట్టించిరన్న వాదన బయలుదేరినది. పంటల నష్టపరిహారము చెల్లించి, తనవారిని తీసుకొని పోవలసినదిగా కబురు పంపిరి. ఇది వెంకటగిరి వారికి అవమానము, పరాభవముగా పగ పెంచుకొనుటకు కూడా దారితీసినది. పెళ్ళూరు రాజులకు తగిన గుణపాఠం చెప్పుటకు యుద్ధప్రయత్నములు చేయుచున్నట్లు వార్తలు అందుచున్నవి పెళ్ళూరు రాజులు వారిని ఎదుర్కొనుటకు అంగబలము, ఆర్థికబలము కలుగజేసుకొనుచున్నారు. ఇరుపక్షములవారు భయాందోళనముతో వున్నారు.

వెంకటగిరి సంస్థానము ఆర్థికముగాను అంగబలము కలిగి రాజకీయముగా పేరు పొందియున్నది. పెళ్ళూరు మందపాటి రాజులు తెలివి గలిగినవారు అయినప్పటికీ ఆర్థికముగా అంగబలము తక్కువగా

వున్నది. పెఠ్నూరువారికి యుద్ధము సంభవించినచో శత్రువులను ఎదు ర్కొనుటకు తగిన స్థోమత తక్కువగా వున్నది. యుద్ధములో ఓడి పోయి పరాభవము, అవమానము పొందుట కంటే ఏదో ఒకఉపాయము చేత సర్దుబాటు చేసుకొనవలెనని తగిన ఆలోచనలు చేయుచున్నారు.

పెఠ్నూరు సంస్థానమునకు అంతరంగికుడు, ఆత్మీయుడు, గ్రామ–దేశవ్యవహారములలో ముఖ్యసలహాదారు, మంత్రివర్యులు దేవీ ఉపాసకులు, ఆర్వేల నియోగి బ్రాహ్మణుడు వల్లూరు నివాసి అద్దంకి రామచంద్రయ్యను పిలిచి సలహా అడిగియున్నారు

అద్దంకి వంశజులు మొదటనుండి దేవీ ఉపాసకులు, భూత ప్రేత పిశాచగణముల బారినుండి కాపాడగలిగినవారు ఆత్మస్థయిర్యము తెలివితేటలు కలిగి కార్యములను చాకచక్యముగా పరిష్కరించగల నేర్ప రులు అవసరమైతే అగ్నిగుండమునుండి అమ్మను (దేవిని) ప్రస న్నముచేసుకొని, చీడపీడలు రాకుండా కాపాడగల మంత్ర తత్పరులు. రామచంద్రయ్య ఆజన్మ బ్రాహ్మచారులు.

వెంకటగిరి వారి కుట్ర కుతంత్రములు తెలుసుకున్న అద్దంకి రామచంద్రయ్య ఆలోచించి, పెఠ్నూరు రాజులకు చక్కని సలహా చెప్పారు. యుద్ధము జరిగినచో, దానిని ఎదుర్కొను శక్తిసామ ర్థ్యములు, సైన్యసహకారము అవసరము. ప్రస్తుత పరిస్థితులలో అది మనకు తక్కువగా వుంది. వారు మనలను మట్టుపెట్టి పెత్తనము చాలా యించవలెనని తలంచుచున్నారు.

మనకు సైన్యము తక్కువ–బలము చాలనప్పుడు మానవశక్తి ద్వారా "మహాయజ్ఞముచేసి, మంత్ర తంత్రములలో అమ్మవారిని ప్రస న్నము చేసుకొని, శక్తి సంకల్పముతో ఎదుటివారిని త్రిప్పకొనుటకు ప్రయత్నము చేయవలసి యున్నది. దానివలన యుద్ధము ఆగిపోవుటయే గాక, ప్రజలకు నష్టము కష్టము కలుగకుండాపోతుంది. లేదా ఇతర రాజుల ఆశ్రయించి తగిన సైన్యసహకారము, ఆర్థికబలము పొందవలసి యున్నది.

"అవసరమైతే యీ యజ్ఞమునకు తగిన బ్రహ్మజ్ఞాని, దేవీ ప్రసన్నులు, యోగీంద్రులు వున్నారు. వారితో సంప్రదించి తగిన సహాయ సహకారములు పొందగలవారము" అన్నారు అంతకన్న మించిన ఉత్తమ మార్గము లేదన్నారు.

అద్దంకి రామచంద్రయ్య సలహాలను, సూచనలను పెళ్ళూరు రాజులు విన్నారు. సావధానముగా ఆలోచించారు అంగబలము, ఆర్థిక బలము చాలనందున ప్రస్తుతము యీ ఆపదనుండి తప్పించుకొనుటకు తగిన విధానము రామచంద్రయ్యకు అప్పగించారు.

దానికి యజ్ఞయాగాది క్రతువులు చేయవలసి వున్నదని, కావల సిన సకల సదుపాయములు కామందులవారు సమకూర్చవలసినదిగా కోరియున్నారు. "ఆది పరాశక్తి" అమ్మవారు ఆగమనంద్వారా ఈ గండము గడిచితే అంతకన్న కావలసిన దేమున్నది? అని తలంచి తగిన సలహా సంపత్తిని సమకూర్చుటకు పూనుకున్నారు పెళ్ళూరు రాజులు.

కావలసిన వస్తువాహనములు తెప్పించారు. అతిముఖ్యులకు జాబులు వ్రాయించి పిలిపించారు. పూర్తి బాధ్యతలు వహించి ఈ యజ్ఞ మును నిర్విఘ్నముగా కొనసాగించవలసినదిగా కోరియున్నారు.

అద్దంకి రామచంద్రయ్య తనకు ముఖ్యులు, గురుతుల్యులు, వైదికశ్రేష్ఠుడు, దైవజ్ఞుడు, సకలవేద శాస్త్ర కోవిదుడు, ఆదిపరాశక్తి-అమ్మవారి ఉపాసకులు, మంత్ర-తంత్ర విద్యావిశారదుడు, శక్తిస్వరూపి ణిని అష్టబంధనముచేత ఆపగల ధైర్యశాలి, భయంకరమైన క్షుద్రశక్తు లను సైతము బాపోషనముద్వారా ఆపగల శక్తివంతుడు అయిన శ్రీశ్రీశ్రీ బరూరి నరసింహయోగీంద్రులవారిని కలిసి, విషయము తెలి పారు. వారి సూచనలను, సలహాలను పాటించి తగిన విధముగా కార్య క్రమములు చేయుటకు పూనుకున్నారు.

శ్రీ యోగీంద్రులవారు నిర్ణయించినరోజు రాగా, వారిని సకల రాజమర్యాదలతో ఆహ్వానించారు. ఫల-పుష్ప-పూజాది ద్రవ్యములతో

సత్కరించారు. వారు పలుచోట్ల పరిశీలించి మహాయజ్ఞమునకు తగిన స్థలమును సూచించారు. ప్రస్తుత శ్రీవేణుగోపాలస్వామి రుక్మిణీ సహిత సత్యభామాదేవాలయమునకు సమీపాన తగిన ఏర్పాట్లు చేయుట జరిగింది.

యజ్ఞశాలలో యజ్ఞవేదిక-అగ్నిగుండము, కుండలీకరణీకము తదితరములు నిర్మించారు, త్రేతాగ్నులు రగుల్చుటకు తగిన విధముగా అమర్చి, యజ్ఞకార్యకర్తగా అద్దంకి రామచంద్రయ్యను నిర్ణయించి, కార్యక్రమమునకు ఉపక్రమించుట జరిగింది.

మంచి కొబ్బరి, ఆవునెయ్యి, ఇతర అవసరమైన వస్తుసామాగ్రితో అగ్నిహోమము ప్రారంభించారు. వివిధ ప్రాంతములనుండి "మహాశక్తిని" ఔపోషనము చేయుటకు వచ్చిన వేదపండితులు,ఋత్విక్కులు, మంత్రతంత్రములు పఠిస్తున్నారు. క్రియాహ్నికము జరుగుచున్నది.

శ్రీ యోగీంద్రులవారి అధ్వర్యములో మహాయజ్ఞము వైభోపేతముగా జరుగుచున్నది.

కానివారు కొందరు, కావాలని కొందరు ఈ వార్తను ఆఘమేఘాల మీద వెంకటగిరి రాజావారికి అందజేశారు. రాజావారు మంత్రి పురోహితులు ఆలోచించారు. అంతరంగికులు కొందరు పెళ్ళూరువారికి యుద్ధం ద్వారా గుణపాఠం చెప్పాలని సూచించారు. దానివలన ఫలితం చెడుతుంది. పైగా మనలను దుర్మార్గులుగా ప్రజలు తలంచగలరు.

దూరదృష్టి గలవారు కొందరు పెళ్ళూరు వారి యజ్ఞమును భగ్నము చేయుటకన్నా మరొక మార్గంలేదన్నారు. దానివల్ల వారికి బుద్ధిరాగలదన్నారు. ప్రతిఫలముగా మరొక యజ్ఞములను ఏర్పాటుచేసి, పెళ్ళూరు వారు తలపెట్టిన దానిని జరగకుండా చూడవలసినదిగా రాజావారికి చెప్పారు.

ఇది అందరికి ఆమోదముగా తలంచి తగిన ఏర్పాట్లు చేయవలసినదిగా వెంకటగిరి రాజావారు సూచించారు. శక్తికి ప్రతిశక్తిని సృష్టించి ఆపదలు రాకుండా కాపాడగల పోలూరి వంశజులను పురికొల్పినారు.

వారికి సహాయకులుగా బెజవాడనుండి పరాంకుశం వారిని పంపించారు. వీరిద్దరు పరాశక్తి ప్రసన్నోపేతులు. సృష్టికి ప్రతిసృష్టి చేయగల సమర్థులు. భూతప్రేతాది పనులు బాగుగా తెలిసినవారు. వైదికశ్రేష్ఠులు.

రాజావారి ఆంతరంగిక అమాత్య శేఖరులు, సింగన్న మాత్యుని ద్వారా సకల ధన వస్తు వాహనములను సమకూర్చబడినవి. పెళ్ళూరు రాజులు తలపెట్టిన యజ్ఞమును భగ్నము చేయుటకు వెంకటగిరి రాజా వారు పంపించిన మాంత్రిక–తాంత్రిక క్షుద్రశక్తి సంపన్నులు, పండిత పరివేశకులు రహస్యముగా పోలూరివారి గృహ సమీపములో హోమము సాగించారు.

ఇది తెలిసిన కొందరు అద్దంకివారి యజ్ఞమును ఆపుట కష్టమన్నారు. శ్రీ యోగీంద్రులవారి మంత్ర-తంత్ర శక్తియుక్తులముందు పోలూరివారి ప్రయత్నములు వృధా అన్నారు. అనుభవముగలవారు ఎక్కడ ఏమి అంటే ఏమి జరుగుతుందో-రాజుల పరిపాలనలో జరుగుచున్న విషయములు తెలిసికూడా నిమ్మకు నీరెత్తినట్లు చూడవలసినదే. బయటకు పొక్కరాదని తలచి ఫలితము కొరకు ఎదురుచూడసాగారు.

అద్దంకి రామచంద్రయ్య యజ్ఞకర్తగా కూర్చుండి, తదేకముగా సకల వస్తువులను హోమములో సమర్పించుచున్నారు. ఋత్విక్కులు గళయుగళములనుండి వెలువడు వేదమంత్రములకు శక్తి స్వరూపం ఓంకార నాదంతో వినవస్తున్నాయి యజ్ఞకుండలములనుండి ఏకధాటిగా ఎగసిన విప్పురవ్వలు గగనమున మేహావృతమై కమ్ముకొన్న పొగ దట్టముగా కన్పించుచున్నది.

దూమరాశి ఆకారరాకరములుగా దట్టముగా అగ్నికుండలముల నుండి వెలువడుచు జ్వలిత జ్వాలామానమై ప్రకాశించుచున్నవి. అదిగో శక్తిరూపం వస్తుందంటే ఇదిగో దేవి ఆగమనం కలుగుతుందని పుకారులు, భయాందోళనమును కలిగించుచున్నది.

ఈ వార్త చారులవలన తెలుసుకున్న పోలూరివారు, పరాంకుశం వారు తగిన విధముగా ప్రయత్నములు చేయుచున్నారు. అద్దంకివారి

యాగమునుండి ఉద్భవించుచున్న శక్తి స్వరూపమును, యజ్ఞకర్త రామచంద్రయ్యకు దక్కకుండా, చిక్కకుండా, అందకుండా, పొందకుండా దారి మళ్ళించుటకు తగిన ప్రయత్నములు చేశారు. అవాంతరములు కలిగించి యజ్ఞమును విఘ్నము చేయుటకు వివిధ మంత్ర–తంత్రములలో నిమగ్నులై యున్నారు.

అంతేకాదు ప్రధాన కారకులయిన శ్రీ యోగీంద్రులవారికి కొన్ని యిబ్బందులు కలిగించి, అడ్డదారి త్రొక్కుటకన్నా మించిన మార్గము లేదని తలంచారు. సక్రమమైన పద్ధతిలో పనిని సాధించలేనప్పుడు అడ్డదారి (దొడ్డిదారి)కి పోవుట రాజకీయమన్న నీతి.

క్షుద్రశక్తులను సృష్టించి, అంతర్గతముగా వాటిని ఎదుటివారిపై ప్రయోగించి. తమ కర్తవ్యమును నెరవేర్చుకొనుట ప్రస్తుతము వారు తలంచిన కార్యము. అవి సక్రమముగా పని చేయుచున్నది లేనిది తెలుసుకొనుటకు కొంతమంది గూఢచారులను వినియోగించారు. వారు క్షుద్రశక్తుల మహిమవల్ల శ్రీ యోగీంద్రులవారు తరచు మూత్రవిసర్జనకై పోవుచున్నారని చెప్పారు. మరల బావి నీటితో శుభ్రత చేసుకొని వస్తున్నారని మనవి చేసారు. ఇది వారికి ఆనందం అవకాశముగా భావించి తమ కార్యములో నిమగ్నమై, అశ్రద్ధ చేయక అతి జాగ్రత్తతో వ్యవహరించుచున్నారు.

గురూపదేశంతో అద్దంకివారి యజ్ఞము నిర్విఘ్నముగా సాగుచున్నది. శ్రీ యోగీంద్రులవారు కలశములలోని పసుపు నీటితో సంప్రోషణము చేయుచున్నారు. ఋత్విక్కులు షొడషోపచారములై వేద మంత్రములతో వివిధ విధములుగా ఆవాహనము చేయుచూ, మహాశక్తి స్వరూపము కొరకు ఎదురు చూస్తున్నారు.

(1) ఆవాహన మంత్రోచ్చారణ-ఓం దేవియేనమః (2) ఆసనం (రత్న సింహాసనము అమర్చుట) (3) పాద్యం (అమ్మవారికి పాదములు కడుగుట) (4) అర్ఘ్యం (5) ఆచమానం (6) స్నానం (అమ్మవారిని పంచామృతములతో స్నానము చేయించుట) (7) వస్త్రం సమర్పయామి (పవిత్రములైన పీతాంబరములు అమ్మవారికిచ్చి ధరింప

జేయుట) (8) యజ్ఞోపవీతం (9) గంధం (రక్త చందనముతో అమ్మవారికి గంధం పూయుట) (10) పుష్పం సమర్పయామి (బహు విధములయిన పుష్పములతో అమ్మవారిని సేవించుట) (11) దూపం (12) దీపం (13) నైవేద్యము (క్షీరాన్నం) (14) తాంబూలం (15) నమస్కారం (16) ఉద్వాసనంతో అమ్మవారిని ఆగమనం జరుగుతుందని తలంచి శ్రీ యోగీంద్రులవారు అద్దంకి రామచంద్ర య్యకు సైగ చేశారు. సర్వం సిద్ధము చేసుకొని పూర్ణాహుతి సమర్పించు టకు సంసిద్ధులై, వేదమంత్రోచ్చారణతో ఎదురుచూచుచున్నారు.

చారులవలన యీ రహస్యము తెలుసుకున్న పోలూరివారు-పరాం కుశంవారు మరుక్షణంలో శ్రీయోగీంద్రులవారికి బాధలు కలిగించే భయం కరమైన ప్రయోగం చేశారు భరింపరాని కడుపునొప్పితో మలమూత్ర విసర్జన కలుగునటుల తమ శక్తి-యుక్తులను సాధించి, వారిపై అంతర్గత ముగా ప్రేరేపించారు· అవకాశమును తెలియజేయవలసినదిగా చారులను పంపించారు.

శ్రీ యోగీంద్రులవారు మలమూత్ర విసర్జన బాధను భరించలేక బయటికి పోవలసి వచ్చింది. శక్తి స్వరూపంరాగానే పూర్ణాహుతి పూజాది కార్యములు నెరవేర్చవలసినదిగా రామచంద్రయ్యకు, తక్కిన ఋత్వి క్కులకు చెప్పి తప్పనిసరి పరిస్థితులలో బయటికి వెళ్ళారు.

త్రియాగ్నిక కుండలమునుండి మెరుపులా, జ్వాలలు ప్రజ్వరిల్లు చున్నవి. కళ్ళు మిరిమిట్లు కొల్పుచున్నవి. తళుక్కున ఏదో ఆకారం ఉత్పన్నమైనట్లు, వచ్చి వారి ముందర నిలచినట్లు పొగలు-సెగలు కమ్ముకొని భ్రమను కలిగిస్తున్నాయి.

వేదమంత్రముల ఘోష, అగ్నిజ్వాలల మ్రోతలమధ్య తదేకంగా భయం భక్తితో యాగ్నికమువైపు చూస్తున్న రామచంద్రయ్యకు వళ్ళు జలదరించింది. చెమటలు పట్టి, కళ్ళు మూతలు పడుచున్నాయి. ఇంతలో ఏదో ఆకారం తళుక్కున మెరిసి, అగ్నిజ్వాలలనుండి బయటికి వచ్చి, తన ఎదుట నిలబడింది.

ఆ రూపం రామచంద్రయ్యకు ఎరుపురంగులో సూర్యబింబము వలె ప్రకాశిస్తూ, పన్నెండేళ్ళ బాలాకుమారిగా కన్పించింది. కాళ్ళకు అందెలు, సుందరరూపం, పెద్ద బొట్టు, కనులనుండి అగ్నిజ్వాలలు ప్రసరించుచున్నట్లు కన్పించుచున్నది. చూచుటకు భయంగా వుంది.

ఆ జ్వలిత జ్వాలామయమైన తేజోవంతమైన కాంతి పుంజములను తేరిపార చూడలేక వివశులైనారు కొందరు. ఆ మహాశక్తి కనులనుండి అగ్నిజ్వాలలు ప్రస్ఫుటమౌతున్నాయి. వాటిని సూటిగా చూడలేక కనులు మూసుకొని విగతజీవులై, చైతన్య రహితులై స్థాణువులా నిలబడిపోయారు మరి కొందరు. రామచంద్రయ్యకు మతిపోయినంత పని అయి, చేయవలసిన కార్యములు మరచిపోయి భయంతో నిలబడి పోయాడు. శ్రీ యోగీంద్రులవారి సూచనలు-సలహాలు ఎవరు పాటించలేదు, ఆచరించలేదు మతిమరుపు కలిగిందో, భయంచేత అసలు విషయం మర్చిపోయారు.

అగ్నిజ్వాలల నుండి ఆవిర్భవించిన మహాశక్తికి బలిహారంగాని, పూర్ణాహుతిగాని సమర్పించలేదు. అమ్మవారికి ఆహుతి ఇచ్చి ప్రసన్నము చేసుకొని తన ఆధీనంలో అవసరమైన కోర్కెలు నెరవేర్చుకొనవలసియున్నది.

ఆమెకు శాంతి కలిగించలేదు. వేడి తగ్గించలేదు. అందువలన అమ్మవారు ఆగ్రహించి ఊరు వీధిగుండా నడక సాగించింది. తన ప్రళయకాల శక్తి స్వరూపాన్ని, అగ్నిజ్వాలల తేజోమయ కాంతిని చూడలేక కొందరు ఎదురుపడినవారు కనులు మూసుకొని తొలగిపోవుచున్నారు.

ఆమె చూపుల వాడికి వేడికి చెట్లు చివరలు కాలిపోతున్నాయి. గుట్టల చివరలు తగలబడిపోతున్నాయి. ఇండ్లలోని గుడ్డలు కొంత కాలిపోతున్నాయి. ఊరు దాటింది. వాగు దాటింది. పొలిమేరదాటి ఊత ముక్కల గ్రామ పరిసర ప్రాంతాలకు చేరుకుంది

2)

వచ్చుచున్న అమ్మ శక్తిస్వరూపము అగ్నిజ్వాలలు వెలుగును చూడలేక కొందరు కనులు మూసుకొని, దాటిపోతున్నారు. చూచినవారికి కళ్ళుమంటలు-వళ్లు మంటలు కలుగుచున్నవి. ఈత ముక్కలలో నివశించుచున్న ఇనకొల్లు వంశజుడు రామస్వామిరెడ్డి తన పొలములోగల వేలాం నుండి వేకువజామున ఆవుపాలు తీసుకొని ఇంటికి వస్తున్నారు. వారికి వల్లూరు వెళ్ళుటకు వస్తున్న జంగమదేవరలు నాగం వారు శంఖుల వంశజులు తోడైనారు దూరాన్ని నుండి వస్తున్న వెలుగును గమనించారు.

ఏదో శక్తి అలిగి గ్రామంమీదకు వస్తుందని తలంచారు. ఆమెను ఆపుటకు ఆలోచించారు. జంగంవారు వచ్చీరాని మంత్రాలు వల్లిస్తూ, రెడ్డిగారి దుత్తలోని ఆవుపాలు అందుకని, భయంవీడి, దగ్గరకు వచ్చిన అమ్మవారికి అందించారు దుత్తలోని పాలన్ని త్రాగింది. తపనతీరింది. కళ్ళ నుండి వస్తున్న జ్వాలలు తగ్గిపోనారంభించాయి. ఆగిపోయింది.

కరుణ కలిగిందేమో అక్కడ నుండి కదలలేదు. ముగ్గురు అమ్మవారిని తప్పులు వుంటే క్షమించమని వేడుకొన్నారు. అమ్మవారు అక్కడనే నిలచి వుంటానన్నది. మా గ్రామ ప్రజలకు ఆదిదేవతగా ఆపదలు రాకుండా కాపాడమని కోరుకున్నారు. ముఖ భాగము నుండి జ్వాలలు ప్రసరించుట చేత జ్వాలాముఖి అమ్మవారుగా ప్రసిద్ధి పొందినది.

ఈతముక్కల పొలిమేరలో వెలయుటచేత ఈతముక్కల జాలమ్మ దేవతగా నేటికి ప్రసిద్ధి పొందుచున్నది. జంగమదేవరలద్వారా గ్రామ పెద్దల సహకారముతో పూజలు జాతరలు ప్రతి సం॥రం చేయించుకొనుచున్నది గ్రామములోని ప్రజలకేగాక అనేక మందికి కోర్కెలు తీర్చి కాపాడగలుగుతోంది.

అమ్మవారు దారితప్పి ఊరి పొలిమేరలు దాటిపోయిందని, శ్రీ యోగీంద్రులవారు బయటికి పోయిన తర్వాత అర్ధంకి రామచంద్రయ్య అమ్మవారిని ఆపలేకపోయారని, వారి యజ్ఞము భగ్నము జరిగిందని

తెలుసుకున్న పోలూరివారు పరాంకుశంవారు పరమానందము చెందారు. కార్యము సాధించినందుకు పరాంకుశం వారిని అభినందించారు. తమ పని పూర్తి అయినందున యజ్ఞయాగాదులు ఆపుచేసి ఈ విషయము వెంకటగిరి రాజా వారికి తెలియజేయగలందులకు బయలుదేరి వెళ్ళి నారు.

మలమూత్ర విసర్జన పని పూర్తిచేసుకొని, దేవాలయం బావిదగ్గర పవిత్రంగా స్నానమాచరించి, యజ్ఞవాటికకు వచ్చిన శ్రీ యోగీంద్రుల వారికి విషయము అర్థంగాక, అర్థంకి రామచంద్రయ్యను అడిగారు. వారు భయంతో జరిగిన విషయం చెప్పారు. వేద పండితులు ఋత్వి క్కులు మంత్రోచ్చారణను మాత్రం ఆపకుండా వల్లిస్తున్నారు. అగ్ని హోమము మాత్రం యథా ప్రకారముగా ప్రజ్వరిల్లు చున్నది.

కాని వారెవరో కావాలని ఆటంకము కలిగించారని శ్రీ యోగీం ద్రుల వారు తలంచారు కాని పనికాకుండా పోతుందా, కార్యముసాధించి తన శక్తి స్వరూపమును ప్రజలకు తెలియజేయాలనుకున్నారు. యజ్ఞము నకు విఘ్నము కలుగకుండా వేదమంత్రోచ్చారణము చేయించు చున్నారు. రామచంద్రయ్యతో సమస్త వస్తువులను క్రమముగా హోమ ములో వేయించుచున్నారు. తన యోగ బలంతో ఆవాహనం చేశారు.

మంత్ర తంత్రములతో ఓంకారనాదం మారుమ్రోగుచున్నది. త్రియాగ్నికము నుండి అగ్నిజ్వాలలు ఉవ్వెత్తున ప్రజ్వరిల్లు చున్నవి. పొగలు-సెగలతో గగనము మేఘావృతముగా చుట్టుపట్ల దట్టముగా ఆలముకొన్నది. మంటల నుండి ఉల్కలు మధ్య మధ్యలో మానవా కారముగా కన్పిస్తున్నాయి.

వేదమంత్రముల నాదము మధ్య శ్రీ యోగీంద్రుల వారు షోడ షోపచారములయిన వివిధ కార్యముల ద్వారా అమ్మని అవాహనము చేయుచున్నారు. శక్తి స్వరూపము ఏర్పడుటకు తగిన చిహ్నములు కన్పించుచున్నవి. అగ్ని జ్వాలల మధ్య నుండి ఉల్కలు ఆకార రాక రములు పొగలు సెగలు నుండి వస్తున్నట్లు తెలుస్తుంది. శక్తి స్వరూ

తము సంసిద్ధమై తగిన సమయమునకు ఉద్భవించుటకు యింకా అట్టే సమయము పట్టదని శ్రీ యోగీంద్రుల వారు తలంచారు.

వేదపండితులను, ఋత్విక్కులను రామచంద్రయ్యను అతి మెలుకువతో వుండవలసినదిగా సూచించారు. అక్షంతలు పట్టుకొని కొందరు, పాలు-పండ్లు-నేయి తదితర ఫలహారములతో మరికొందరు, పసుపు కుంకుమ నిమ్మకాయలతో యింకొందరు, పూర్ణాహుతి పట్టుకొని అర్ధంగి రామచంద్రయ్య శక్తి స్వరూపమునకు ఆహుతి ఇచ్చుటకు సంసిద్ధమై సంప్రోషనము చేయుచున్నారు. శ్రీ యోగీంద్రుల వారు తన మనస్సులో పలుమారులు మంత్రోచ్చారణ చేశారు.

వేదమంత్రోచ్చారణముతో సమస్త కార్యములు సంప్రోషనము అయిన తర్వాత అగ్ని హోమము నుండి జ్వాలలు-జ్వాలల నుండి ఉల్కలు-ఉల్కల మధ్య ఏదో ఆకారము రాసాగింది. శ్రీ యోగీంద్రుల వారు ఒకసారి కళ్ళు మూసుకొని ఓంకారము చేశారు. మంత్ర బీజములు వల్లించిన వెంటనే ఉల్కల మధ్య నుండి మిరిమిట్లుకొల్పు క్రాంతితెల్లని ఆకారమొకటి వారి ఎదుట నిలబడింది. అమ్మవారి ఆగమనం జరిగింది

తెల్లని చీర, నల్లని కురులు-సుందర రూపము చంద్రబింబము వలె-నుదుట బొట్టు అభయ హస్తముచాపి, చిరునవ్వుతో దేనికోసమో ఎదురు చూస్తున్నట్లుగా కన్పించింది. ఇది గమనించిన శ్రీ యోగీంద్రుల వారు అర్ధంకి రామచంద్రయ్యతో పూర్ణాహుతి చేయించారు. పాలు, పండ్లు అమ్మవారికి అందించారు. మెల్లగా తినసాగింది. ఋత్విక్కులు నిమ్మకాయలతో బలిహారము చేశారు. ఎరువు ముద్దతో అమ్మవారికి బలిహారము చేశారు. పసుపు నీళ్ళు అమ్మవారిపై చల్లి కొబ్బరికాయలు కొట్టి, హారతులిచ్చారు.

ఆకలి తీరిందేమో చిరునవ్వుతో అమ్మవారు తొలిఅడుగువేసింది. "రాబోవు ఆపదల నుండి ప్రజలను కాపాడవలసినదిగా" అమ్మవారిని శ్రీ యోగీంద్రులవారు ప్రోషనము చేశారు. అమ్మవారు తలూపి.

మరొక అడుగు ముందుకు వేసింది. భయ భక్తులతో అందరు మంత్రో చ్చారణతో అమ్మవారిని అనుసరించారు, అమ్మవారు టంగుటూరి రామ దాసు సత్రము దగ్గర ఆగింది. శ్రీ యోగీంద్రులవారితో సహా వేద పండితులు, ఋత్విక్కులు అమ్మవారిపై అక్షంతలు వేశారు. అక్కడ నుండి బయలుదేరి యజ్ఞకర్త అద్దంకి రామచంద్రయ్య యింటి దగ్గర ఆగింది. అక్కడ కూడా అమ్మవారిపై అక్షంతలువేసి, పసుపు నీళ్ళు చల్లారు. అక్కడ నుండి బయలుదేరి పశ్చిమదిశగా పయనించి పండు బాట (డొంక) దాటి వల్లూరు చెరువు కట్టుకు దిగువ భాగమున నిలచిపోయింది.

అక్కడ కూడా యధా ప్రకారము శ్రీ యోగీంద్రుల వారు అద్దంకి రామచంద్రయ్య ఇతర మంత్రవేత్తల ద్వారా అక్షంతలు వేయించారు అమ్మవారు కదలలేదు, వేదమంత్రోచ్చారణము చేయించారు. అయిన అమ్మవారు కదలలేదు. పసుపునీళ్ళు చల్లించి, గావు చేయించారు. కుంభము పోయించారు. అయినా అమ్మవారు కదలలేదు. నోరు మెదపలేదు· మా తప్పులు చెప్పమని వేడుకున్నారు.

ఇంతలో ఒకరికి పూనకము వచ్చింది. కేకలువేయుట మొదలు పెట్టాడు. యోగముద్వారా విషయము తెలుసుకున్న శ్రీ యోగీంద్రులు పసుపునీళ్ళు చల్లించి, విషయము ఏమిటని అడిగారు. వెంటనే వాడు నే నిక్కడనే వుంటాను. గ్రామమును రక్షిస్తుంటాను. ఈతిబాధలు రాకుండా చూస్తుంటాను. మీ కోరికలు తీరుస్తుంటాను. నాకు కావలసి నప్పుడు పూజలు, పొంగళ్ళు, కొలుపులు, జాతరలు చేయించమని పలికింది. ఆచారములు, వేడుకలు చేయించండని అడిగింది.

అందరు సంతోషపడినారు. పసుపు కుంకుమలతో అమ్మవారిని పూజించారు. కాపాడమని వేడుకున్నారు. జరుపవలసిన తతంగము అంతా శ్రీ యోగీంద్రులవారు దగ్గర వుండి అద్దంకి రామచంద్రయ్య ద్వారా జరిపించారు. విషయము తెలుసుకున్న పెళ్ళూరు రాజులు ఆనందించారు. శ్రీ యోగీంద్రులవారితోసహా అందరినీ అభినందించారు. వారందరినీ తమ దూతద్వారా పంపి సత్కారము చేసారు.

# ఉల్కాముఖి వల్లూరమ్మ

శ్రీ యోగీంద్రులవారి ఆధ్వర్యములో శ్రీరామచంద్రయ్య యజ్ఞ కర్తగా నిర్వహించిన హోమమునుండి జ్వాలలు, జ్వాలలనుండి ఉల్కలు ఉద్భవించుట, ఆ ఉల్కలద్వారా వచ్చిన శక్తి స్వరూపము కనుక ఉల్కాముఖీ అన్నారు. అనగా అగ్నిజ్వాలలనుండి ఒకరకమైన తెలుపు రంగులో వచ్చు రవ్వలునే ఉల్కలందరు ఆ ఉల్కల ముఖమునుండి ఉద్భవించినది కనుక ఉల్కా ముఖి అమ్మవారు అన్నారు.

అమ్మవారు శక్తిస్వరూపము, మహాత్మ్యమును కలిగి గ్రామదేవతగా వల్లూరులో వెలసినది. చీడపీడలు, ఈతిబాధలు రాకుండా వల్లూరు ప్రజలను కాపాడగలుగుచున్నది. ఉల్కాముఖి అమ్మవారు వల్లూరులో శిలయై సర్వులకు కన్పించుచుండుటచేత గ్రామప్రజలు వల్లూరమ్మ అని పిలుచుకొనుటకు వీలు కలిగింది, ప్రసిద్ధి పొందుచున్నది.

ఆమె రాత్రిపూట గ్రామగవిళ్ళు కాస్తున్నది. ఇతర గ్రామ పొలిమేరలనుండి భూత-ప్రేత-పిశాచగణములు రాకుండా చూడగలుగుతుంది. చుట్టుపట్ల గ్రామాల వారికికూడా ఆపదలు రాకుండా ఆదుకొనుచున్నది. పశువులకు-పైరులకు-మనుష్యులకు, స్ఫోటకము వగయిరా వ్యాధులు రాకుండా ఈతిబాధలనుండి రక్షించుచున్నది. చల్లనితల్లి ఉల్కాముఖీ-వల్లూరమ్మ. పరాశక్తి.

# అమ్మవారు పలురకములు

సర్వాంతర్యామి అయిన పరమాత్ముడు, పరబ్రహ్మ స్వరూపంలో-నిరాకార-నిర్గుణుడని వేదములు చెప్పుచున్నవి. సృష్టి జరిగి

నప్పుడు సకార-సద్గుణుడుగా ఉద్భవించుచున్నాడని పురాణములు తెలుపుచున్నవి. సృష్టి-స్థితి-లయలకు కారణమగుచున్నాడు. సామాన్య మానవుడికి సఫలీకృతుడై వివిధ రూపములతో అనేక నామములతో కన్పించుచున్నాడు. భక్తివిశ్వాసములతో ప్రజలను కాపాడగలుగు చున్నాడు.

ఆదిపరాశక్తి-సృష్టికి మూలము. అమ్మలేనిదే బ్రహ్మసృష్టి లేదని భాగవతము తెలుపుచున్నది ఓంకార స్వరూపములో త్రిజగన్మాతలు ఉద్భవించి, పంచభూతాత్మకమై ప్రజ్వరిల్లుచున్నారు. వారిని దేవతలను చున్నారు పరమపూజ్యులు ఆరాధన.

"రూపం మనీయం బ్రహ్మైతత్ సర్వకారణ కారణం

మాయాజష్టాన బూతంతు సర్వసాక్షి నిరామయః"

సరస్వతీ-లక్ష్మి-పార్వతీ మొదలయిన పేరులతో పిలచి, వారి కోర్కెలు తీర్చుకొనుచున్నారు. ఒక్కొక్క రూపం-లేక నామము ఒక్కొక్క కార్యమునకు ఉపయోగబడినది. దుష్టశిక్షణకు ధర్మరక్షణకు అవతరించినది. ఆరాధించబడినారు.

"దేవీనాం కార్యసిద్ధ్యర్థ మావిర్భవతి సాయుదా"

# గ్రామదేవతలు

గ్రామ క్షేమములను దృష్టిలో పెట్టుకొని, చీడపీడలను-ఈతి బాధలనుండి రక్షించుటకు, ప్రజలను కాపాడి సుఖముగా జీవించుటకు అనాదికాలమునుండి శక్తిస్వరూపముతో గ్రామదేవతలను మహనీయులు సృష్టించారు. స్ఫోటకము మొ॥ వ్యాధులు వర్షములు లేక కరువు కాటక ములు సంభవించినప్పుడు ఈ దేవతలకు పూజలు, పొంగళ్ళు, జాతరలు కొలుపులు చేయుట ఒక ఆచారముగా వస్తున్నది. జంతుబలులను సమ

శ్రీపైరు. వీరిని క్షుద్రశక్తులు అంటారు. అక్కా-చెల్లెళ్ళు, పేరంటాళ్ళు అనికూడా పిలువబడుచుండును.

వీరు పోలేరమ్మ, గంగమ్మ, జాలమ్మ, స్వర్ణమ్మ, అంకమ్మ, మహాలక్ష్మమ్మ, నాంచారి, తదితర నామములతో కొలుస్తుంటారు. తలుస్తుంటారు. వీరు మొదటనుండి మాంసాహార భక్షకులు. జంతుబలులకు ప్రీతిపాత్రులు. జాతరలకు-కొలుపులకు ఉప్పొంగిపోవుచుందురు. గ్రామములలో జరుగు నష్ట కష్టములు నివారిస్తుంటారు.

## క్షుద్రశక్తులకు దైవత్వం కలగటం

నాగరికత పెరిగి, ప్రజలకు తెలివితేటలు కలిగినప్పుడు మార్పులు రావటం సహజం. ఈ మార్పులవలన జంతుబలులకు ప్రీతి-పాత్రులయిన క్షుద్రశక్తులకు నిత్యపూజలు, అర్చనలు, మంత్రతంత్రములతో ఉత్సవములు జరిపించుకొనుచున్నారు. భక్తుల కోర్కెలు తీర్చుట చేత దైవికముగా భావించబడుచున్నారు.

ఉదాహరణకు సూళ్ళూరుపేట చెంగాళమ్మ, కావలి కలగోళమ్మ, బెజవాడ దుర్గమ్మ, ఈతముక్కల జాలమ్మ, మద్దిపాడు పోలేరమ్మ, ఉలవపాడు అంకమ్మ, కందుకూరు మహాలక్ష్మమ్మ, పైడిపాడు గంగమ్మ అద్దంకి నాంచారమ్మ తదితరదేవతలు ఆయా గ్రామములలోను, పరిసర ప్రాంతములవారికిని నిత్యము నైవేద్యములు, పూజలు, అర్చనలు జరిపించుకొనుచున్నారు. వందల వేల సంఖ్యలో భక్తులువచ్చి తమ కోరికలు నెరవేరినందున సంతోషముగా అమ్మవారలకు అభిషేకములు చేయించుచున్నారు.

అట్టి దేవతామూర్తులలో ప్రస్తుతము మన చరిత్రకు సంబంధించిన వల్లూరమ్మ ఒకటి. ఈమె ఒంగోలుకు 5 కి.మీ.దూరం దక్షిణమున గల వల్లూరను గ్రామములో వెలసిన దేవతామూర్తి. శిలాభోగముషలన

అప్పటినుండి స్థలభోగమువలన తప్పకుండా మహాత్మ్యములు చూపించి, ప్రజలకు సాయపడి కాపాడగలుగుతుంది. సర్వులకు ప్రీతిపాత్రురాలయి తన ఆలయమునకు రప్పించుకొనుచున్నది.

## శ్రీ వల్లూరమ్మ అద్దంకివారి ఆడపడుచు

వల్లూరులో నివసించు వంశజులలో అద్దంకివారు అతిముఖ్యులు. వీరు మొదటనుండి దేవీ ఉపాసకులు, గ్రామములో కీలకమైన పాత్ర వహించు నియోగుల్లు. ప్రముఖ భూతవైద్యము తెలిసినవారు రాచకార్య ములలో నుండుటచేత అందరికీ ఆమోదముగా నుండెడివారు. గ్రామ ములో ఏది జరిగినా మెదట వారింటివద్ద పరిష్కరింపబడుచుండును.

అందువలన పెళ్ళూరు మందపాటిరాజులు అద్దంకి రామ చంద్రయ్యను ఆహ్వానించి, వెంకటగిరి రాజావారిద్వారా ప్రమాదములు జరగకుండా శక్తి స్వరూపము ఏర్పడుటకు కారకులయిన విషయము తెలిసినదే. ఉల్కాముఖివరప్రసాద వల్లూరమ్మ పుట్టుటకు కారకులు అద్దంకి వారు. వారి యింటివద్దనుండియే సకల సదుపాయములు అమ్మవారికి సమర్పించుచుందురు. వారి ఇలవేల్పుగా కొలుచుచుందురు.

తమ ఆడపడుచుగా చీర రవికలు—పసుపు కుంకుమాది పూజాది ద్రవ్యములు ఒసగుచుందురు. వడపప్పు-పానకము మొదట అద్దంకి వారు సమర్పింతురు. తర్వాత ఇతరులు మొక్కుబడులు చెల్లించుచుం దురు. అప్పటికి ఇప్పటికి అలానే జరుగుచున్నది. అందువలన మొదటి నుండి గ్రామప్రజలు వల్లూరమ్మ అద్దంకివారి ఆడపడుచు అనుట ఆచార ముగా వినవస్తుంది. వారి ఇలవేల్పుగా పూజిస్తున్నారని తెలుస్తుంది.

వల్లూరులో నివశించు అతి ముఖ్యులలో అద్దంకివారు ఒకరు. అద్దంకి వంశజులలో రామచంద్రయ్య-బుచ్చయ్య అన్నదమ్ములు. రామ

చంద్రయ్యకు వెంకటకృష్ణయ్య వెంకటకృష్ణయ్యకు వెంకట సుబ్బారావు-వెంకటసుబ్బారావుకు-విద్యాసాగర్ (బుజ్జి) అనువారలునూ-

బుచ్చయ్యకు శ్రీరామమూర్తి పంతులు, శ్రీరామమూర్తికు వరదయ్య, వరదయ్యకు చిన్న బుచ్చయ్య చిన్నబుచ్చయ్యకు నరసింహరావు, నరసింహరావుకి సూర్యనారాయణ (Hyd) శర్మ సంతతికలిగి, గ్రామములో కీలకపాత్ర వహించినట్లు తెలియుచున్నది. శ్రీవల్లూరమ్మ విషయములో మొదట నుండి వీరు ప్రధాన పాత్రదారులు-పోషకులు కూడా. నియోగులు—ఆప్తులు.

శ్రీ భాగవతుల రాధాకృష్ణమూర్తి (రాధాకృష్ణయ్య అనేవారు) వల్లూరులో మరొక శాఖవారు. వీరి సంతతిలోని దక్షిణమూర్తిగారి ఆడపడుచును అద్దంకి వంశజులలో ఒకరికి యిచ్చి వివాహము సంబంధము కలిగి యున్నందున బంధుత్వము ఏర్పడినది వీరు వైదిక కర్మలకు వారసులుగా వుండి గుడి-గోపురములు, పురాణ కాలక్షేపములు గ్రామంలోనే గాకుండా చుట్టుపట్ల నిర్వహించేవారు. అమ్మవారికి జరుగు వేడుకలలో అద్దంకివారితో కలసి, పలు కార్యక్రమములు నిర్వహించేవారు.

## అమ్మవారి ప్రాణ ప్రతిష్ట

అద్దంకివారి ఆధ్వర్యములో భాగవతులవారు యితర గ్రామ పెద్దలు కలసి అమ్మవారి ఆలయము ఏర్పాటు చేయాలని తలంచారు. తెనాలి ప్రాంతములో గల ప్రముఖ శిల్పులలో ఒకరయిన శ్రీ కొలకలూరి బాలకోటాచారిని పిలిపించారు. నివాసము కల్పించారు. శ్రీ వల్లూరమ్మ విగ్రహమును తయారుచేయించి, ప్రాణప్రతిష్ట చేయుటకు పూనుకొన్నారు

**1770** నలనామ సం॥రం॥ మార్గశిర శుద్ధ దశమి శుక్రవారం పగలు భాగవతుల దక్షిణమూర్తిచేత రాళ్ళు ఎత్తించి, ప్రాణప్రతిష్ట

చేయించారని గర్భగుడి పై భాగమున శిలాశాసనము చెక్కబడి యున్నది. గుడి పునఃనిర్మాణము జరిగినందున రాతిని తొలగించి ప్రక్కన పెట్టినట్లు తెలియుచున్నది.

అమ్మవారి శిలా విగ్రహమును చతుర్భుజములు కలిగి భక్తులను ఆకర్షించునటుల తయారుచేసిన బాలకోటాచారిగారికి కొంత భూమిని అద్దంకివారు అనుభవించుటకు వీలు కల్పించారు. జలములేక సరిగా పొలము పండనందున వారి కుమారులు డా॥ రత్నాచారిగారు, కందు లూరు పోతూరి కోటయ్య చౌదరికి మాన్యమును అమ్మివేసినట్లు చెప్ప బడుచున్నది. ప్రస్తుతము వీరి వంశజులు వల్లూరులో లేరని తెలు స్తుంది.

ఉల్కాముఖి పేర వల్లూరు గ్రామ దేవతగా వెలసిన అమ్మవారు రాత్రులందు జనం మాటు మణిగినతర్వాత ఆపదలు రాకుండా నాలుగు వైపుల తిరుగుచుండెడిది. మేలి ముసుగు వేసుకొని, గాజుల సవ్వడితో గజ్జల మ్రోతతో కొందరకు విన్పించుట కన్పించుట జరుగుచుండేది. దేవీ ఉపాసకులయిన రామచంద్రయ్యగారిని, శ్రీ యోగింద్రులుగారి పిలిస్తే పలికేవి. అడిగింది ఇచ్చేది.

అమ్మవారు క్షుద్రశక్తో, భద్రకాళో, ఆది పరాశక్తో అవతార మూర్తో మొత్తము పై గ్రామవాసులకేగాకుండా, పరిసరప్రాంతముల వారికి కూడా ఆపదలు రాకుండా కాపాడుతుంది. ఒకవేళ ఏదయినా మనుష్యులకు, పశువులకు, పైరులకు అపదలు కలిగినప్పుడు, స్ఫోట కము మొ॥ వ్యాధులు సంభవించినప్పుడు, అతి వృష్టి అనావృష్టి వలన ఈతి బాధలు కరువు కాటకములు ఏర్పడినప్పుడు, వాటి నివారణకు శక్త్యానుసారము వడపప్పు పానకము అద్దంకివారి ఆధ్వర్యములో జరుగు తుంటాయి. జాతరలు కొలుపులు పొంగళ్ళు పెట్టుచుంటారు. జంతు బలులు జరుగుతుంటాయి. అమ్మవారు ఆనందం చెంది, సమస్యలు మటుమాయమౌతుంటాయి.

# నాటి పరిస్థితులు

వల్లూరు అగ్రహారములో అద్దంకివారు, భాగవతులవారు, పరాంకుశం వారు దివివారు, టంగుటూరివారు, పోలూరివారు, పచ్చవపిల్లుట్ల, తదితరులు 21 నియోగకుటుంబములవారు 9 వైదిక కుటుంబముల వారు వున్నట్లును వీరుగాక 14 రెడ్ల కుటుంబములవారు-31 గొల్లలు, 5 మరాటీలు, 9 కుటుంబములు చాకలివారు, కుమ్మరులు 9 కుటుంబముల వారు, మంగలి 7 కుటుంబములవారు, జంగములు 4 కుటుంబములు. వడియారులు 15, దూదేకులవారు 8 కుటుంబములు, విశ్వబ్రాహ్మణ 3, బోయవారు 7 కుటుంబములు ఇతరులు కలసి (బలిజలు, మాదిగలు) మొత్తము 190 కుటుంబములవరకు వున్నట్లు టంగుటూరి కోదండరామమూర్తి పంతులు రికార్డులో వ్రాసుకొనియున్నారు.



వీరందరు వారి వారి వృత్తి ధర్మములననుసరించి కూలినాలి-వ్యవసాయము మొ॥ పనులలో జీవించేవారు సరైన వ్యవహారముగాని ప్రధాన సమస్యగాని వచ్చినప్పుడు పై నియోగులయిన అద్దంకివారు పరిష్కరించుచుందురు. వల్లూరు, పెళ్ళూరు చెరువులు రామలక్ష్మఖుల

వలె వర్షాకాలముతో పాడిపంటలకు నిలయమై సకల సంపదలతు సమృద్ధిగా నుండెడివి.

పని పాటలు చేసుకొనువారికి లేదనకుండా పెట్టుపోతలతో దండిగా వర్ధించేవారు. వ్యవసాయ సంబంధముగా రాబడి తగ్గినప్పటికీ- వ్యవహార సంబంధము గౌరవ మర్యాదలతో జీవనము సాగించిన రోజులు.

అట్టి సందర్భములో శ్రీ వల్లూరమ్మకు పూజలు నిర్వహించు టకు, నైవేద్యము సమర్పించుటకు అద్దంకివారికి ఆప్తులు మిత్రులు అయిన పచ్చవ పాపయ్యగారిని ఏర్పాటు చేశారు. అలాగే కొలుపులు, జాతరలు, పొంగళ్ళు పెట్టునప్పుడు, పాల్గొను పనిపాటల వారికి ముఖ్యంగా కుమ్మరులు, భజంత్రీలు, మంగలి, చాకలి, మాదిగ తది తర వృత్తుల వారికి కూడా మాన్యములు అందజేశారు. కొంతకాలం ఆనందోత్సాహములతో జరిగింది.

అమ్మవారి గుడి చిల్ల చెట్లతోను, ముళ్ళపొదలతోను నిండి యుండేది. పోవుటకు సరిఅయిన మార్గము వుండేదికాదు. పల్లేరుకాయల మయం. అయిన పచ్చవ పాపయ్య శుక్రవారం, ఆదివారం అమ్మవారికి పూజలు, నైవేద్యములు పెట్టి వస్తుండేవాడు. చుట్టుపట్ల పిల్లలు, గొడ్లు కాచుకొని వారు వస్తే పలహారము అందించేవాడు. రాత్రిపూట జన సంచారము మాత్రం పోయెడివారుకాదు. కీచురాళ్ళ ధ్వనులతో భయం భయంగా వుండేది.

పూజారి వత్తి క్రింద యిచ్చిన మాన్యము (పొలము) సరిగా పండేదికాదు. వర్షములుపడితే చెరువులకు నీళ్ళు లేకుంటే బీళ్ళుగా వుండేవి. చాలీచాలని ఖర్చులతో జీవనము సాగించేవారు. ఆయన తర్వాత కుమారుడు పచ్చవ కుమారస్వామి కొంతకాలము నిర్వహిం చారు వీరి కుమారుడు పచ్చవ వెంకట సుబ్బయ్య మరికొంతకాలము అమ్మవారి పూజలు నైవేద్యములు నెరవేర్చినారు.

## కాలభైరవుడు

అమ్మవారి సన్నిధిలోగల కాలభైరవుడు కథ ఒకటి పూర్వము నుండి వినవస్తున్నది. కాలభైరవుడు అనగా కాలమునను సరించి కని పెట్టుకొని తిరుగువాడు. శివుని మూడవ కన్నునుండి ఉద్భవించిన వాడని కూడా పురాణములో తెల్పబడియున్నది. భూతగణములను కాపాడువాడు. ఆదిపరాశక్తి తోడుగలవాడు.

అమ్మవారి ఆజ్ఞ కావాలన్నా, అమ్మవారు రాత్రులందు వెళ్ళి నప్పుడు కాపలా కాయుచుండెడివాడు. ఏ ఆపదలు రాకుండా చూస్తుండే వాడు. ప్రతిరోజూ అమ్మవారు రాత్రిపూట గ్రామక్షేమము నిమిత్తము వెళ్ళటం, తిరిగిరావటం పరిసర ప్రాంతములలో తిరుగుచుండెడి బుడ బుక్కల వాడొకడు గమనిస్తూండేవాడు.

ఒకరాత్రి అమ్మవారు లేని సమయములో వెళ్ళి గుడిలో కూర్చు న్నాడని, తిరిగి వచ్చి అమ్మవారి రాక గమనించి భయపడి పరుగెత్త పోగా, వల్లూరమ్మ వాడిని శిలగా మార్చిందని కొందరు పూర్వీకులు చెప్పడము కూడా జరిగింది. కాని అది వాస్తవం కాదు.

శిల్పము పరిశీలించిన ఆగమశాస్త్రకోవిదులు అమ్మవారికి ఆపదలు తెలియచేయుటకు ఏర్పడిన కాలభైరవుడు మాత్రమేనని చెప్పబడి యున్నారు.

## అమ్మవారి తిరునాళ్ళు :

అద్దంకివారి ఆధ్వర్యములో పూజలు, నైవేద్యములు నిర్వహించు టయేగాక అప్పుడప్పుడు వల్లూరమ్మకు వడపప్పు, పానకములు, కొలు పులు, జాతరములు చేయుచుంటారు. మొక్కుబడులుగాక కోళ్ళు, మేక

పోతులు (యాట) తదితర జతు బలులు జరుగుతుంటాయి. ఉత్సవంగా ఊరేగింపుతో అమ్మవారి సన్నిధికి చేరుకుంటారు.

ఇది జరిగేటప్పుడు ముందు జాగ్రత్తగా గ్రామ బలిహారము తిరుగుటకు ముందురోజు వెట్టివానిచేత లేక మాదిగవానిచేత చాటింపు వేయించుదురు. దాని ప్రధాన ఉద్దేశ్యము....

బలిహారము తిరిగేటప్పుడు గ్రామములోని పిల్లలు, గర్భిణీ స్త్రీలు బాలింతలు, గొడ్డుగోదా ఎవరూ అడ్డురావద్దని, హానికరమని హెచ్చరిక చేయుదురు. ఇతర గ్రామవాసులకు కూడా తెలియజేయును.

వివిధ వృత్తులవారు, వారి ఆచారము ప్రకారము మేళ తాళము లతో వెళ్ళి మొదట అద్దంకివారి ఇంటి వద్దనుండి పావనముతో ఊరే గింపు బయలుదేరుతుంది. ఎరజర్లనుండి బైనిడివారు వస్తారు. కుమ్మ రులు పావనము పడతారు. ఆచారము గలవారికి గుగ్గిలముతో బైనిడి వారు దేవర ఎక్కిస్తారు.

ముద్రగడకర్త ఇంటివద్దనే ఇతర గ్రామముల వారయిన ఎరజర్ల కొప్పోలు, ఈతముక్కల, కారుమంచి, చింతలపాలెం, జయావరం, సూరారెడ్డిపాలెం, నాయుడుపాలెం, టంగుటూరు, వెన్నూరు, వెంకన్న పాలెం, పెళ్ళూరు, దేవరగల వారుకూడా పాల్గొనెదరు. బండ్లు కట్టుకుని కొందరు మొక్కుబడి గలవారు కూడా వచ్చెదరు.

## కత్తి, గజ్జ:

ఈ జాతరలో మరొకటి కత్తి, గజ్జద్వారా నాట్యము చేయుట. ఆచారము ప్రకారము మాదిగలు ప్రధాన పోషకులు. తూములూరి వంశ జాలలో ఎకోబు తదితరులు అంగీ ధరించి, కాలికి గజ్జలు కట్టి, దారు కత్తి, చేతిరుమాలుపట్టి తప్పెటలు, సన్నాయి, డోళ్ళు మ్రోగంగా,

జైవిడివారి మంత్రం, గుగ్గిలం పొగలమధ్య దేవర ఎక్కించుచుండ శివమెత్తినవారయి చిందులు తొక్కుచు, నాట్యమునకు ఉపక్రమించు తాడు.

ఈయన వాలకం చూస్తే భయంకరంగా వుంటుంది ఆరున్నర (6-1/2 అడుగుల) భారీమనిషి, బొర్రమీసాలు, పెద్ద కనుగ్రుడ్లతో, తలగడచుట్టి, అరుపులు, కేకలతో చూపరులకు ఆశ్చర్యము కలిగిస్తుం టాడు.

తప్పెట్లు, పంబజోళ్ళ. మేళతాళములతో నాట్యము చేయుచూ, అడుగులు వేయుచూ, చేతులు త్రిప్పుచూ, కులుకుతూ, పలుకుతూ గ్రామ ప్రధాన వీధులగుండా ఊరేగింపు బయల్దేరుతుంది.

ఇతరులను కూడా ప్రోత్సాహిస్తూ, అతడిని అనుసరిస్తూ నాట్యము చేయుదురు.

# బొల్లి ఆవు, పుల్లి ఎద్దు

ఇది యాదవ వంశజుల ఆచారము. దీనికి సంబంధించిన చరిత్ర కొంత కోదండరామమూర్తి పంతులుగారి దగ్గర గలదు. దేవతాంశ ముతో కూడిన బొల్లి ఆవు పుల్లి ఎద్దును (ఒంటికొమ్ము) యాదవులు భుజముపై ధరించి వీరత్రాళ్ళు, బారెడు కత్తితో రంగ ప్రవేశము చేస్తారు.

గంగ సేవకులుగా వీరు ఈ కొలువులలో పాల్గొనుట వారి ఆచా రము.

కాకర్లవారు మొదట గంగదేవతకు పూజ చేస్తారు. పావనములో గల వీరత్రాళ్ళకు బారెడు కత్తికి పసుపు కుంకుమతో పూజ చేస్తారు. వీరికి గంగమ్మతల్లి ప్రధాన క్షేత్ర పాలకురాలు. జంగంకుంట్ల-పిచ్చి కుంట్లవారు కూడా పాల్గొంటారు.

ఈ బొర్రిఆవు-పుల్లఎద్దు 2 1/2 అడుగుల ఎత్తుండి, తేలికరకం చెక్కతో బరువు లేకుండా సున్నితంగా తయారుచేశారు. ఎరుపు, తెలుపు రంగులతో విగ్రహములు గలవు. వాటిపై రకరకముల చిత్రములు వేసియుండును. బొడికొమ్ము, ఒంటికొమ్ము సహజంగా వుండును.

క్రింది భాగము భుజముపై పెట్టుకొని ఎగురుటకు అనువుగా నాట్యము చేయుటకు వీలుగా వారుబల్లతో చెక్కతాపడము చేయబడి యుండును. మెడలో వీరత్రాడు కట్టెదరు.

ఆచారము ప్రకారము దేవర ఎక్కించిన తర్వాత అరుపులు-కేకలతో చిందులు వేయటం, కత్తులతో వంటిపై గీరుకుకొనటం జరుగుతుంది.

చూచేవారికి ఎక్కడ శరీరం తెగిపోతుందోనని భయం కలుగుతుంది. వారికి ఉత్సాహం కలిగించుటకు మేళతాళములవారు, తప్పెళ్ళవారు, పంబజోళ్ళవారు విపరీతముగా చెవులకు ధ్వనులు కలిగేటంత ప్రమోగించుచుందురు.

వీరంగం వేయుచూ, వీరత్రాళ్ళతో ఒకరికొకరు చేతులు చాపి కొట్టుకొనుచుందురు. ఆ మ్రోతలు భయం కలిగిస్తుంటాయి. గజ్జల మ్రోతలలో నాట్యము చేయుదురు. ఆనందోత్సాహములతో ముందుకు సాగిపోవుదురు.

## మాతంగి కన్య

అమ్మవారి కొలుపులు—జాతరలలో ఈమె పాత్ర ఉల్లాసమును కలిగిస్తుంది. అనాధి నుండి వస్తున్న ఆచారము ప్రకారము దేవళము లలో స్వామి ప్రీత్యార్థం దేవదాసీలుండేవారు. స్వర్గంలో ఊర్వశి, మేనక,

రంభలాగా యిక్కడ దేవళములలో పలు భంగిమలతో నాట్యముచేయు చుందురు. నృత్యమును ప్రదర్శించుచుందురు. రాజుల కొలువులో కూడా నాట్యముచేసి రసికులను ఆనందపరచుట ఆచారముగా వస్తుంది.

అలాగే అమ్మవారి కొలువులు జరుగునప్పుడు నృత్యం చేయుటకు వచ్చినవారిని మాతంగి కన్యలని మనం పిలుచుట జరుగుచున్నది. మతంగముని కన్యలని కూడా పిలవబడుచున్నారు. కన్యగా నుండగనే శంఖ-చక్రగదా ముద్రవేస్తారు. తర్వాత వారికి పెండ్లి జరగకుండానే కన్యలుగా వదలివేస్తారు.

వీరు మద్యమునకు బానిసలై వివిధ రకముల నృత్యములతో భక్తులను ఆనందింపజేయుదురు. ఆదారము కలిగిన ఇతరులు ఈమెతో హుషారుగా వీరంగం వేస్తారు. ఈమె నృత్య-నాట్యం—నడకతీరు—హావభావము కొలువులలో చేరినవారికి ఉల్లాసం కలిగిస్తుంది. దేవర మనుష్యుల మధ్య చేరి వీరంగం వేస్తుంది. అటు కత్తి-గజ్జకట్టినవారిని, ఇటు బొల్లావు పుల్ల ఎద్దు వానిని ఉడికిస్తూ, ఉలికిస్తూ, కవ్విస్తూ, నవ్విస్తూ అడుగు వేయుచూ, అందరిచేత వేయిస్తూ ఊరంతా తిరిగి, తెల్లారే సరికి గుడికి చేరుతుంది.

అమ్మవారి గుడి సమీపించినకొలది వేడుకలు ఎక్కువై వేప మండలతో కొట్టుకొనుచు పూనకం వచ్చి హాహాకారాలతో ఊగిపోతుంటారు. పసుపునీళ్ళు చల్లి, కొబ్బరికాయ కొట్టి "అపచారం ఎందమ్మా" అని అడుగుతుంటారు. దయ్యాలు పట్టినవారి కేకలు, ఏడుపులు విన వస్తుంటాయి. గ్రామ పెద్దలు అందరిని తృప్తి పరచుచూ, ప్రశాంత వాతావరణములో జాతర జరుగునట్లు చూస్తుంటారు.

ఇక గుడి దగ్గర అమ్మవారికి వడపప్పు, పానకము చెల్లించేవారు. కోళ్ళు వేటలు బలి ఇస్తుండేవారు, పొంగళ్ళతో ప్రదక్షణములు చేస్తుండేవారు మా కోర్కెలు తీర్చమ్మా—మమ్ముల కాపాడమ్మా అని వేడుకొనేవారు, పసుపు, కుంకుమలతో పూజించేవారు-వందల వేల

సంఖ్యలో అక్కడ వుండటం మనకు కన్పిస్తుంది. వారి కోర్కెలు తీరు స్తుంది. వారిపాలిట కల్పతరువుగా నిలుస్తుంది. అమ్మవారి ప్రభావము నలుదిశల వ్యాపించింది. వెన్నెల వెలుగై ప్రసరిస్తుంది.



చతుర్భుజే–చంద్రకళావతంసే-కుచోన్నతే-కుంకుమరాగశోణే.

పుండ్రేక్షు-పాశాంకుశ-ఖడ్గ-డమరహస్తే–సమస్తే-జగదేకమాత.

అమ్మవారి రూపం భక్తులకు ఆనందం. చతుర్భుజములు (4) కలిగి, ఒక చేతిలో ఖడ్గము రెండవ చేతిలో త్రిశూలము, మరొకచేతిలో డమరకము, నాలుగవ చేతిలో అభయ హస్తము కలిగి, ముఖమున

క్షంద్రబింబంతో మోము శోభితమై, ప్రకాశవంతముగా చిరునవ్వుతో వెలుగుచున్నది.

1) సంతానము లేనివారు పుత్రభిక్ష పెట్టమని మనసారా వేడు కొందురు. 2) పాడిపంటలు దండిగా నిండుగా వుండాలని వేడు కొందురు. 3) కరువు కాటకములు ఈతిబాధలు రాకుండా చూడమని కోరుకొందురు "సర్వేజనా సుఖినోభవంతు- లోకా సమస్తా సుఖినో భవంతు" అని స్మరింతురు. తరింతురు. యిలా మొదట అద్దంకివారు నైవేద్యం చెల్లించి, పూజాది కార్యములు చేయించుదురు. తర్వాత కులముల వారిగా నైవేద్యములు చెల్లించు చుందురు.

జముకులవారి కథలు, పిచ్చికుంట్లవారి వీధి భాగవతము, అమ్మ వారి జన్మవృత్తాంతములు భక్తులకు వేడుకగా విన్పించుచుందురు అమ్మవారు కూడా ఎటువంటి ఆటంకములు లేకుండా ప్రజలను కాపాడ గలుగుతుంది. చీడ పీడలను తొలగించి పాడి పంటలయందు మేలు కలిగిస్తుంది. ప్రజల మనస్సులోగల కోర్కెలను తీర్చుటచేత వల్లా తమ్మను, చల్లని తల్లని విధిగా పూర్వం నుండి కొలుస్తూ తలుస్తూ రావటం జరుగుచున్నది. అమ్మవారి పేరు పెట్టుకొనడమే కాదు వాహన ములపై, కాఫీహోటళ్ళ పై అమ్మవారి పేరు వ్రాసుకొనుచున్నారు. నిత్యము పూజలు, అర్చనలు జరుపుకొంటూనే, ప్రభుత్వం వారు జంతు బలులు నిషేధించినప్పటికి, మొక్కుబడులు గలవారు మరో ప్రక్క జరుపుతున్నారు.

పూజారులు, పని పాటలు నిర్వహించువారు మొదట నుండి- అద్దంకివారి సహాయ సహకారములతో మెలుగుచుండిరి. దీనికి గాను- మాన్యము క్రింద కొంత పొలమును పనివారలకు బహుమానం ఇవ్వబడి నది. దానిపైగల ఫలసాయము రాబడి తింటూ, అవసరమైనప్పుడు ఇటువంటి వేడుకలు నిర్వహిస్తుండటం జరుగుచున్నది.

అయితే పొలమ్ము సరిగ్గా పండేదికాదు, వర్షములు సకాలంలో వుండేవి కావు. మనుష్యులలో మార్పు కలుగుతున్నట్లే కాలంలో కూడా-

మార్పు కలిగి జరుగుబాటు లేక కొన్ని కుటుంబముల వారు వలసవెళ్ళ వలసి వచ్చినది. యితర గ్రామాలకు జీవనము నిమిత్తం వదలి వెళ్ళ వలసి వచ్చినది.

అట్టి సమయములో పచ్చవ వెంకటసుబ్బయ్యగారు, వారి సమీప బంధువు గూడల శేషయ్యగారికి వల్లూరమ్మ కొలువు అప్పగించుట జరిగింది. అలాగే మాదిగలకు—వెట్టివారికి. కుమ్మరులకు, మంగలి, తదితర వృత్తులవారి కిచ్చిన మాన్యములు సరిగా పండక, వృత్తి ధర్మమును వదులుకొనక చాలీచాలని జీవనము సాగించుచున్నారు.

## బలిజ తగా

శ్రీ వల్లూరమ్మ తిరనాళ్ళ జాతర, కొలుపులప్పుడు మాదిగలకు, బలిజలకు తగదాలు వచ్చాయి. మాదిగల కత్తి గజ్జకట్టి తమ వీధికి వచ్చినప్పుడు ఆటకాయించేవారు. ఒకరిపై ఒకరు కారాలు మిరియాలు నూరుకొనుచుండేవారు. గ్రామ పెద్దలు తీర్పు చేస్తూండేవారు.

ఒక్కొక్కసారి ఘర్షణకు దిగి, తగవులు, కొట్లాటలు జరుగుచుండేవి. పెద్ద తరంపోయి పెత్తనములలో కొంత మార్పు వచ్చుచున్నప్పుడు అంతరాయము కలుగుచుండేది. అద్దంకివారు, భాగవతుల వారు, దివివారు, టంగుటూరువారు తగిన తీర్పు నేర్పు జరిపించుచుండెవారు.

అయినా బలిజలు వారి బజారులో మాదిగలు కత్తి, గజ్జకట్టి చేతి రుమాలు చేతబట్టి నాట్యము చేయుటకు ఆటంకపరిచేవారు. ఊరేగింపుగా వస్తున్న ఉత్సవములను నిలుపుదల చేయించేవారు ముందుకు సాగనిచ్చేవారు కాదు. అడ్డగించేవారు, మూర్ఖముగా వినేవారుకాదు. కారణము ఎవరో మాదిగ కులస్థుడు బలిజకుల అమ్మాయిని తీసుకొని పోయాడట.

పరిష్కారము కాకపోతే బలిజల వీధిలో కత్తి గజ్జ నాట్యముఆపి సడి సందడి లేకుండా ముందుకు సాగిపోయి, వీధి మలుపు తిరిగిన తరువాత మరల ఉత్సవము సాగించేవారు ఇది చిలికి చిలికి గాలి వానగా తయారైన దరిమిల కోట్లాట జరిగేది. తలలు పగలటం, చేతులు కాళ్ళు విరగటం జరిగేవి, పెద్దలకు పరిష్కారంగాక పోలీసుల దాకా వెళ్ళేది.

వారు రంగ ప్రవేశంచేసి, తగాదాలకు మూలమైనవారిని కొంద రిని అదుపులోకి తీసుకొనేవారు. జాతరలప్పుడు ప్రమాదాలు జరగ కుండా గొడవలు రాకుండా చూడగలిగేవారు. గ్రామ పెద్దలలో మునసబు, కరణీకులు కోర్టులో తీర్పుచెప్పేవారు. అయినా స్థలం దగ్గరో, పొలం దగ్గరో తగాదాలు పెట్టుకొనుట, కొట్టుకొనుట, కేసులు పెట్టుకొనుట, కోర్టులదాకా వెళుచుండేది. వాయిదాలమీద తిరుగుచుండే వారు.

అలా ఒంగోలు మునసబు కోర్టుకు ఆర్ సి నెం 399/31 తే. 12-8-31 ప్రకారం జడ్జి విధించిన తీర్మానము ప్రకారం కొంత కాలం అమ్మవారి జాతరలు-కొలుపులు జరుగుతున్నాయి.

శ్రీ వల్లూరమ్మ దేవత కొలుపు లేక జాతర జరుపుకొనునప్పుడు ఏర్పాటు చేసుకొను ఉత్సవములందు మాదిగలు కత్తి-గజ్జ కట్టుకొని నాట్యము చేయుచూ, మేళతాళము తదితర వాయిద్యములతో వచ్చుచూ బలిజలుగలప్రాంతం వీధులకు వచ్చినపుడు అయిదుగజముల దూరంలో నృత్యములు-మేళతాళములు ఆపి మామూలుగా ముందుకు సాగిపోయి బలిజల ఇండ్లు-వీధి దాటిన తరువాత యథాప్రకారం ఊరేగింపు కొన సాగించుకొనవచ్చునని, ఉత్తర్వులు (ఇంజక్షన్) ఇచ్చి అమలుచేయు టకు గ్రామ అధికారులకు ఆదేశములు అందచేసారు.

పై ఉత్తర్వులు అతిక్రమించి ఎవరయినా విరుద్ధముగా ప్రవర్తిం చినను, గొడవలు, ఘర్షణలు జరిగినను, వారి యీనాములు (భూములు) రద్దు చేయటయేగాక తగిన విధంగా శిక్షింపబడుదురని తెల్పియున్నారు.

ఇప్పటికి కత్తి-గజ్జ నాట్యంగాని యితర వేడుకలుగాని అక్కడమాత్రం జరుగుటలేదు. ఈ అమ్మవారి జాతరలు జరుగుచున్నప్పుడు పోలీసు బందోబస్తు ఏర్పాటు చేయుచున్నారు.

## శిలాభోగం స్థలాభోగం

పవిత్రమయిన శ్రీ వల్లూరమ్మ సన్నిధికి చేరితే మనకు తెలియని ఆనందమేదో కలుగుతుంది. భక్తిభావము ఏర్పడుతుంది.

పాములకు, తేళ్ళకు నిలయమయిన యీ స్థలము నేడు సుందర నందనోద్యానమువలె వెలుగుచున్నది అనేక వసతులతో వందలాది భక్తులు రాకపోకలకు వీలు కలుగుచున్నది.

ప్రథమ స్వాతంత్ర్యము తర్వాత బ్రిటీషు గవర్నమెంటువారు శ్రీ వల్లూరమ్మ దేవత పేరగల ఈనాములు (భూమి) స్థలములు అర్చకులకు, పనిపాటలు నిర్వహించువారికి స్వంతముగా పట్టాలు ఇచ్చి, ఫలసాయము పొందుటకు వీలు కల్పించిరి. ధనధాన్యములు వంతులు వారి పంచుకొనుచుండెడివారు.

ఏదయినా పేచీలు వచ్చినప్పుడు అద్దంకి కృష్ణయ్య, పిల్లుట్ల నరసింహ్వాయ్య, తూములూరి వీరరాఘవయ్య, టంగుటూరి కోదండ రామమూర్తి, చదలవాడ పిచ్చయ్య, దివి రామానుజాచార్యులు, అనుమాచార్యులు తదితరులు సహకరించెడివారు. కార్యములు నిర్వహించుటకు పూనుకొని కృషిచేయుచుండిరి.

## గంగమ్మ పోలేరమ్మ

సదరు దేవళమునకు ఇరువైపుల గంగమ్మదేవత-పోలేరమ్మ తల్లి

ప్రతిష్ఠింపబడియున్నారు· ఈ చిన్న గుడులలోగల దేవతామూర్తులకు కూడా వారంవారం వడపప్పు-పానకము పూజలు ఆకాశములు సద్ది తదితర నైవేద్యములు చెల్లించుచుందురు.

గంగమ్మ దేవతకు మొదటినుంచి నక్కవారి వంశజులు పూజారులుగా నుండుచుండిరి. నక్క కోటయ్య అతిముఖ్యులు. యరజర్ల, కాకర్లవారు విధిగా ఈ ఉత్సవములలో పాల్గొనెదరు. దీనిపై వచ్చు ఆదాయమును ఆయా కుటుంబములవారు అనుభవింతురు.

పోలేరమ్మ తల్లికి పూజాది కార్యక్రమములు మొదటనుండి ఉప్పుటూరి వంశజులు నిర్వహిస్తున్నారు· ఉప్పుటూరి యలమంద ప్రధాన కర్తగా ఉండేవారు. వీరు కుమారులు విధివశాత్తు ఆ దేవతను నమ్ముకొని జీవిస్తున్నారు. ఈ మహాతల్లికూడా వడపప్పు-పానకంబు-సద్ది తదితర నైవేద్యములు చెల్లించుచుందురు. శ్రీ వల్లూరమ్మ తల్లి దగ్గరకు వచ్చిన ప్రతివారు గంగమ్మ దేవతను, పోలేరమ్మతల్లిని విధిగా పూజించిపోవుచుందురు. ఆచారములుగల వారి సంగతి అసలు చెప్పనవసరము లేదు. వారు ఎల్లప్పుడు వీరికి పూజలు చేయుచు వరములు పొందుచున్నారు.

# శ్రీ వల్లూరమ్మ చల్లని తల్లి

శ్రీ వల్లూరమ్మ అవతరించిన తర్వాత అనేక మహాత్మ్యములు కలిగించినది. మొదట శ్రీ యోగీంద్రులవారుగాని అద్దంకి రామచంద్రయ్యగాని పిలిచితే పలికేదట. అపదలు రాకుండా చూడమని వేడితే తల్లి చల్లగా చూచేదట. అమ్మవారిని ఆశ్రయించినవారికి కొదవ లేకుండా చూచినదట. సంతానంలేనివారికి సంతానం, సర్వరోగాలవారికి

నివారణము పాడిపంటల యందు పెంపుదలకు కలిగించినటుల విన వస్తుండేది.

అమ్మవారిని తృప్తిపరచేటందుకు పొంగళ్ళు జంతుబలులు, యాగములు, కుంకుమార్చనలు, జాతరలు నిర్వహించుట జరిగినది, జరుగుచున్నది. గ్రామదేవతలపై ప్రజలకు భక్తివిశ్వాసములు కలిగి యుండుటచేత పనులు జరివిగే.

స్వాతంత్ర్యము వచ్చిన తర్వాత కొన్ని చేర్పులు-మార్పులు జరిగినవి. అయిన శిలబోగం—స్థలాబోగం కలిగిన శ్రీ వల్లారమ్మకు ఎట్టి ఆటంకములు జరగక, కార్యక్రమములు యధావిధిగా నిర్వహించు చున్నారు.

పచ్చవ వెంకటసుబ్బయ్యగారి తర్వాత అమ్మవారి పూజారులుగా గూడల శేషయ్యగారు నిర్వహిస్తున్నారు. వారి తర్వాత తమ్ముడు వెంకటేశ్వర్లుగారు నిర్వహించుట జరుగుచున్నది. తర్వాత గూడల బంగారయ్య చేయుట జరిగింది. నేడు శేషయ్యకుమారుడు కృష్ణ మూర్తిగారు, బంగారయ్య కుమారుడు విశ్వేశ్వరరావు (విశ్వం) కుమారస్వామి మనుమలు నాగేశ్వరరావు (నాగు) వంతులువారిగా అమ్మవారి పూజాది కార్యక్రమములు చేయుచున్నారు.

మన రాష్ట్రప్రభుత్వమువారు 1966 దేవాదాయ, ధర్మాదాయ శాఖలు గుర్తించి, కొన్ని ముఖ్యమైన దేవాలయములను స్వాధీనము చేసుకొని నిర్వహించుట జరుగుచున్నది. పరిపాలనా వ్యవహారముల తోను, ఆర్థిక పరిస్థితులలోను, కొన్ని దేవాలయములను గ్రామ ప్రజలు ఆలోచించి ప్రభుత్వమునకు అప్పగించుట జరిగింది. అట్టి దేవాలయ ములు కాలమాన పరిస్థితులవలన కొంత అభివృద్ధి చెందినవి. ఇంకా చెందుచున్నవి.



అట్టి సందర్భములలో అద్దంకి సూర్యనారాయణగారు వల్లూరు నుండి హైదరాబాదు మకాంమారుస్తూ తమ ఇంటిని అమ్మవారికి అర్పించారు. వేడుకలు-జాతరలు జరుగునప్పుడు అక్కడినుండియే అన్నిసదుపాయములు కలుగుచున్నవి

అంతేకాదు, తన పొలము అమ్మినదానిలో కొంత సుమారు 10,000/– (పదివేలు) రూపాయలు తనపేర ఒంగోలు ఆంధ్రా బ్యాంకులో ఫిక్సెడ్ చేసి, దానిపైవచ్చు వడ్డీతో ప్రతి సం।।ము అమ్మవారికి దసరా ఉత్సవములు నిర్వహించుటకు తగిన ఏర్పాటు చేయుటకూడా జరిగిందని ఈ దిగువవారివలన కొంత తెలిసింది. వారు పిల్లుట్ల రామ జోగ్యులు, తూములూరి రామావధాని S/o వీరరాఘవులు, మొదలి వెంకటేశ్వర్లుS/o వెంకట సుబ్బయ్య తదితరులున్నారు ప్రస్తుతము పచ్చవ కుమారస్వామి మనుమలు నాగేశ్వరరావు (నాగు)గారు ఈ వ్యవహారము చూస్తున్నట్లుగా చెప్పబడుచున్నది.

"బుద్ధిర్బలం-యశోధైర్యం-నిర్భయత్వమ రోగతా।
అజాడ్యం-వాక్పటుత్వంచ-హనూమత్స్మరణాత్ భవేత్"

అమ్మ నామస్మరణ చేయుటవలన మనకు బుద్ధి (జ్ఞానం),బలం, యశస్సు-ధైర్యము-నిర్భయం రోగములు తొలగుట-జడత్వము లేకుం డుట, వాక్చాతుర్యము కలుగుట జరుగుచున్నది. ఎండోమెంట్సువారి సహాయ సహకారములు, భక్తుల-దాతల ప్రోత్సాహములు అమ్మవారికి అన్ని విధముల ఆటంకములు లేకుండా జరుగుచున్నవి.

గత పాతిక, ముప్పది సం॥లనుండి అమ్మవారి ప్రభావము నలుదిశలా వ్యాపించియున్నది. జి ఎన్ టి రోడ్డుప్రక్కన వెలసి యుండుటచేత నిత్యం టూరిస్టు యాత్రికులు, లారీలు ఇతర వాహన ములవారు అమ్మని స్మరించి, పూజలు చేయించి, అర్చనలు గావించి తమ కోర్కెలు తీరినందుకు సంతోషముతో మొక్కుబడులు చెల్లించి, దర్శించి వెళ్ళుచున్నారు.

పసుపు కుంకుమలతో, పట్టు వస్త్రములతో నానాలంకారములతో దివ్యతేజో విరాజితమై ప్రకాశించుచున్నది. అమ్మవారి సంకల్పము వుండినచో సముద్రాన్ని భూమిగా, భూమిని పరమాణువుగా, గడ్డి పోచను వజ్రాయుధముగా, బీదవారిని భాగ్యవంతులుగా, బలహీనులను మనోధైర్యవంతులుగా, సకల ఐశ్వర్య సంపదలను కలిగించగలదు.

॥క్రియాసిద్ధిస్సత్వే భవతి మహతాంనోపకరణే॥

అమ్మని నమ్ముకొన్నవారికి కొరతే ముండును అన్ని సక్రమ ముగా జరిగిపోతున్నాయి.

అన్ని ఒకఎత్తు, అగస్త్యుడు ఒకఎత్తు అన్నట్లుగా కొన్ని సంవత్స రముల నుండి యీ స్థలము ప్రాచుర్యము పొందుచున్నది. శ్రీచక్ర యంత్రోద్ధారణము, అష్టదిగ్బంధము, ఆమె శక్తి, భక్తులకు సర్వస్వము కలిగిస్తుంది. భక్తుల కోర్కెలు తీరుస్తూ వారిపాలిటి కల్పతరువుగా నిలచి యున్నది. 1979 సం॥ము కంచికామకోటిపీఠాధిపతి శ్రీశ్రీశ్రీ జయేంద్ర సరస్వతీ స్వాములువారు. వచ్చి, అమ్మ శక్తిని పరిశీలించి అష్టసిద్ధులు గలదిగా ఆశీర్వదించి వెళ్ళారు. "సద్వినియోగము జరగవలసిన సమ

యము సంసిద్ధమైనప్పుడు మూలనున్న వస్తువుకూడా ముంగిట చేరు తుందన్నది నగ్నసత్యము" అమ్మవారి మహిమల వలన తెలుస్తుంది.

## సంపూర్ణ శతచండి యాగము

శ్రీ వల్లూరమ్మదేవత ఆశీస్సులు ప్రతిఒక్కరు పొందవలెనని, అందరు సుఖసంతోషములతో జీవించవలెనని శాంతి హోమము జరుపు టకు పలువురు ఆధ్యాత్మిక చింతనా పరులు ఆరంభించారు. ఉదారుల దగ్గరనుండి విరాళములు సేకరించారు. దీనికి కారంచేడు గురువులు హెచ్ నిడమానూరు హనుమంతరావు సిద్ధాంతి ముఖ్యులు.

సుమారు యాభై వేల రూపాయలు [యీ మహాయజ్ఞమును వేద పండితులద్వారా ఆగమ శాస్త్ర సంపన్నులు 108మందిని రావించి కార్య క్రమమును, శక్తిని పెంపొందింప చేశారు. ఇది 24-6-84 నుండి 29-6-84 వరకుజరిగింది. శ్రీవల్లూరమ్మనువరములు అడిగి ఫలితములు పొందిన వారిలో అనేకమంది పలు కార్యక్రమములను ఉదారముగా చేయించారు.

1) కేరళీయుడు ఒంగోలు కొశ్చిన్ కేఫ్ అధినేత శ్రీ రామ చంద్రన్, మురగన్‌గారు అమ్మవారి దయవలన సంతానము పొందుట చేత గుడికి కరంటు వేయించారు.

2) ఈతముక్కల నివాసి అప్పటి జిల్లాపరిషత్‌కు చైర్మన్ అయిన శ్రీ కేసవరపు రామలింగారెడ్డిగారు జి. ఎన్. టి. రోడ్డునుండి గర్భగుడి ఆలయమువరకు తారురోడ్డు వేయించారు.

3) మల్లవరప్పాడు నివాసి శ్రీ సుంకర కన్నారెడ్డిగారిభార్య సుబ్బమ్మగారు అమ్మవారివలన అనుకున్న కోరికలు నెరవేరుటచేత 1978 లో రు. 10,000 (పదివేలు) రూపాయలతో ముఖమండపము నిర్మించుటకు అవకాశము కల్పించిరి.

4) తూర్పునాయుడుపాలెం నివాసి శ్రీ దామచర్ల ఆంజనేయులు గారు అమ్మవారిపై అభిమానముతో దేవాలయ జీర్ణోద్ధరణ సమయమున రు. 10,000 (పదివేల) రూపాయలు విరాళము అందజేశారు.

5) ఇలా గంటలు యిచ్చేవారు, గాజులు తెచ్చేవారు వందల సంఖ్యలో కన్పిస్తున్నారు. వారందరివి వ్రాయాలంటే స్థలము చాలదు.

అంతేకాదు దేవాదాయ ధర్మాదాయ చట్టము అమలులోకి వచ్చిన తర్వాత ఎండోమెంట్సువారు పలు అభివృద్ధి కార్యక్రమములు అమలు చేయుచున్నారు. హిందూధర్మాన్ని పునరుద్ధరించటం.

శిల్పకళా సంపదను కాపాడటం, శిథిలాలయములను పునర్నిర్మించటం, ధర్మకర్తల మండలి ఏర్పాటు, భక్తులకు సకల సౌకర్యములు కలుగజేయుట కనీస బాధ్యతలుగా గుర్తించబడినది.

1) యాత్రికులకు ముందు స్నానములకు, మంచినీళ్ళకు గుడికి తూర్పున పెద్దబావి త్రవ్వించారు. కుళాయిల ద్వారా మంచినీటి సౌకర్యము కలిగించారు.

2) భక్తులకు ఎండకు, వర్షమునకు బాధపడకుండా తగిన వసతులు కల్పించుటయేగాక కొబ్బరిచెట్లు తదితర నీడ మార్గములు కల్పించారు.

3) పొంగళ్ళు పెట్టుకొనుటకు ఫలహారశాల-పాకశాల నిర్మించారు.

4) అతిథి గృహములు ఏర్పాటు చేశారు.

5) అమ్మవారికి ఆదాయము తక్కువ గాకుండుటకు దేవాలయ నిర్వాహకులచేత కొబ్బరి చిప్పలు, ఇతర తినుబండార శాలలకు పాటలు పెట్టి పోటీదారులకు సం॥ తమపాటుసదుపాయం కల్పించి, వచ్చినఆదాయమును గుడి నిర్మాణము తదితర అభివృద్ధి కార్యక్రమములకు వినియోగించుచున్నారు.

6) శ్రీమహాగణపతి యాగాన్ని తే 25–5–91 నుండి 2–6-92 వరకు ప్రజాపతినామసం॥ము అమెరికాతో నికాతిపోర్నియాలోగల శ్రీశ్రీశ్రీ పూర్ణానంద స్వాములవారిచేత నిర్వహింపజేసి భక్తులకు ఆనందాన్ని కలిగించారు.

7) భక్తులు మిక్కుటమై పలు ఇబ్బందులు పడకుండా మండపంలో అమ్మవారి దర్శనార్థం క్యూ ఏర్పాటు చేశారు.

## దేవాలయ జీర్ణోద్ధరణ—విగ్రహాల ప్రతిష్ట

శ్రీ వల్లూరమ్మతల్లి చరిత్ర రెండవ ప్రచురణ రోజుకు ట్రస్టీలు మరియు కార్యనిర్వాణాధికారి శ్రీ యడపల్లి భూషయ్యగారు ఎండోమెంట్స్పై అధికారుల ఆమోదము పొంది దేవాలయ జీర్ణోద్ధరణకు కృషి చేయుట జరిగింది. అసిస్టెంటు కమీషనరు శ్రీ జి. అనంతనారాయణగారు దేవాలయ పునర్నిర్మాణమునకు ప్రభుత్వమునుండి కామన్ గుడ్ ఫండ్ కూడా రావటం జరిగింది.

పైవారందరి కృషి ఫలితముగా పాత గుడిని తొలగించి, విశాలంగా క్రొత్త గుడిని విమానశిఖర నిర్మాణముతోసహా ఏర్పాటు చేశారు. శ్రీముఖనామ సం॥రము శ్రావణ బహుళ షష్టి 8-8-93 ఆదివారంనుండి 12-8–93 నవమి గురువారం వరకు వివిధ విగ్రహాల ప్రతిష్టలుకూడా నిర్వహించారు. దీనికి ఉప్పటూరు శ్రీ కారంచేటి పార్వతీశం గురుకులు, ప్రకాశంజిల్లా బొడపాలెం శ్రీ గూడల శేషయ్య గురుకులు తదితరులు ప్రధానపాత్ర వహించారు.

అమ్మవారి సుందర మందిరముతో పాటు శ్రీ వినాయకుడు, శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరుడు, సింహ వాహనము, కలశ ప్రతిష్ఠ, మహాకుంభాభిషేకము పంచాహ్నిక దీక్షతో ప్రారంభించారు.

శ్రీ చక్రయంత్రోద్ధారణ గావించారు. అమ్మవారికి అభిషేకములు జరిపించారు. పూర్ణాహుతి జరిపించారు. సామూహిక కుంకుమార్చనలు

జరిగినవి. అమ్మవారి మందిరము లోపల-వెలుపల పాలరాయితో పనులు నిర్వహించారు. చుట్టూ ఇనుప తడికలు ఏర్పాటుచేసి, దాతల పేర్లు వ్రాయుట జరిగింది.

వేలాది భక్తుల రాకతో దిన దినాభివృద్ధి చెందుచున్న శ్రీ వల్లూరమ్మ దేవస్థానములో మరికొన్ని సదుపాయములు కలుగజేయవలసి యున్నది. శ్రీ గంగమ్మ దేవత, శ్రీ పోలేరమ్మ తల్లి పాత గుడులను పునః నిర్మించవలసి యున్నది. చెరువులో నీరు లేనప్పుడు యాత్రికులకు ఇబ్బంది లేకుండా బోరులద్వారా నీరుసరఫరాచేయవలసియున్నది, చుట్టూ బయలు ప్రదేశము గాకుండా ముందు ప్రక్కల ప్రహరీగోడలు నిర్మాణము చేయవలసి యున్నది. 365 రోజులు నిత్యపూజలు జరుగునటుల భక్తులు ప్రోత్సహించి విరాళములు యిచ్చి గోత్రనామములతో పూజలు నిర్వహింపవలసి యున్నది.

దేవాలయ ఆవరణలో జంతు బలులు నిషేధించవలసి యున్నది. ఇది చట్ట విరుద్ధమని చాటించినప్పటికి మ్రొక్కుబడులు వారు పాటించుట లేదు. వారికి తగినచోటు ఏర్పాటు చేయవలసియున్నది. శుక్ర-ఆది వారములు రద్దీ ఎక్కువగా ఉండుటచేత వారికి తగిన సదుపాయములు పాలక వర్గము వారు కల్పించవలసి యున్నది.

ఇక అమ్మవారి కరుణాకటాక్ష వీక్షణములు భక్తులపాలిట వర ప్రసాదములు. పేదరికమును పోగొట్టుచున్నది. ధన్యులను చేయుచున్నది. సమస్త వ్యాధులు నివారింపబడుచున్నవి. సంతానము లేని వారికి సంతానము కలిగించుచున్నది. బుద్ధిమాంద్యమును పోగొట్టి సకల సిద్ధి కలుగజేయుచున్నది. విద్యార్థులలో అజ్ఞానమనే చీకటిని తొలగించి, విజ్ఞానమనే వెలుగును కలిగించి ఉత్తీర్ణులను చేయుచున్నది. నమ్మిన వారిని వమ్ముచేయక సకలసౌభాగ్యములు కలిగించుచున్నది. వాహనములు, పశువులు, ప్రమాదములు జరగకుండా కాపాడుచున్నది. అట్టి చల్లని తల్లి శ్రీ వల్లూరమ్మను స్మరించి తరించెదము. భజనలుచేసి, పూజించెదము.

# ఓం గణనాథ!

గణనాథా ఓం గణనాథా
గౌరి నందన - గణనాథా
పార్వతి తనయ - గణనాథా
పాపవినాశన - గణనాథా ॥గణ॥

ఈశ్వరపుత్ర - గణనాథా
విఘ్నవినాయక - గణనాథా
మూషిక వాహన - గణనాథా
మునిజన వందిత - గణనాథా ॥గణ॥

సిద్ధి వినాయక - గణనాథా
బుద్ధిప్రదాత - గణనాథా
భక్త బృందము - గణనాథా
ప్రార్థన చేసిరి - గణనాథా ॥గణ॥

అభయప్రదాత - గణనాథా
శుభములు కలిగించు - గణనాథా
నిన్నే నమ్మితిని - గణనాథా
మమ్ముల బ్రోవుము - గణనాథా ॥గణ॥

(బాపనపల్లి వరలక్ష్మిగారికి అభినందనలతో)

# ప్రార్థన

చల్లని తల్లి - వల్లూరమ్మా
వందనమిదిగో గైకొనుమమ్మా.
మా కల్పవల్లీ - వల్లూరమ్మా
మదిలో నిన్నే - తలచితినమ్మా.
తల్లి-దండ్రి-గురువు-దైవము
సర్వము నీవని కొలిచితిమమ్మా
చీకటి నుండి-వెలుగును యిచ్చి
కరుణతో మమ్ము - కాపాడుమమ్మా
ఎల్లవేళల - నీ నామమును నే
చల్లగ మదిలో తలచితిమమ్మా.
నా హృదయములో - నీ రూపమును
మరువక నేను నిలిపితినమ్మా.
పసుపు కుంకుమలతో పూజించుటకై
నీ సన్నిధికి - చేరియుంటిమి.
మా పూజలు గైకొనరావమ్మా
మము ఆదరించిమరి పోవమ్మా.

(మద్దిపాడు తాటికొండ ప్రభుగారికి అభినందనలతో)

# మేలుకో వల్లూరమ్మా! మేలుకో !!

మేలుకో వల్లూరమ్మా - మేలుకో!
మేలుకొని- చల్లగా మమ్మేలుకో.
దయగల తల్లివని జనులందరు చేరి
ప్రార్థింప వచ్చిరి మేలుకో.

భక్తులెల్లరు నీకు భజనలు చేయంగ
ఉదయమునే వచ్చిరి మేలుకో.
రాకపోకలు ఆపి - వాహనములు నిలిపి
నీ కొరకు ఉండిరి మేలుకో.
ముత్తయిదువులందరు - పసుపు కుంకుమలతో
పూజింప వచ్చిరి- మేలుకో.
పసిపిల్లలతోడి - పడుచులందరుగూడి
మ్రొక్కులిడుచున్నారు—మేలుకో.
గాలి-ధూళివారు- నీ దరికి చేరి
బాధలు తీర్చమని వేడుచున్నారు మేలుకో.
సంతానహీనులు-నీ చెంత చేరి
పుత్రప్రాప్తికొరకు-అర్థించుచున్నారు.
అందరి పూజలు - అందుకొనుటకు
నీవు ముందుగా లేచి మేలుకోవమ్మా.

(చిట్టూరి విజయమ్మగారికి అభినందనలతో)

# దేవీస్తుతి పాలయమాం !

అంబపరమేశ్వరి- అఖిలాండేశ్వరి - ఆది పరాశక్తి పాలయమాం
శ్రీ భువనేశ్వరి - రాజ రాజేశ్వరి - ఆనందరూపిణి—
పాలయమాం
వీణాపాణి- హిమల సరస్వతీ - వేదాంతరూపిణి - పాలయమాం
మంజుల భాషిణి - మంగళదాయని - మధురమీనాక్షి
పాలయమాం
రాజ స్వరూపిణి- శ్రీ చక్రవాహిని- రాజరాజేశ్వరి పాలయమాం

కరుణారూపిణి – అన్నపూర్ణేశ్వరి - చాముండేశ్వరి
పాలయమాం
శ్రీ చక్రనాయకి- త్రిపురాసుందరి శ్రీ లలితేశ్వరి పాలయమాం
చాముండేశ్వరి – గౌరీ మనోహరి - పార్వతీమాతా
పాలయమాం
అంబ జగదీశ్వరి- కాషాయాంబరి- కాళీపరాశక్తి – పాలయమాం
కంచి కామాక్షిని - మధుర మీనాక్షిని – చాముండేశ్వరి-
పాలయమాం

(శ్రీ బావనపల్లి లక్ష్మీకుమారిగారికి అభినందనలు)

మారాలి – మారాలి- మనసే మారాలి
మారినమనసు- దేవతకిస్తే- ఫలితం ఉంటుంది.
మారేమంటూ- మారేమంటూ- గొప్పలు చెపుతారు
ఆ గొప్పలోనే– దేవత మాట-మరచిపోతారు.
మనదేహాన్నంత-ఒక్కొక్కసారి పరీక్షచేయాలి
ఆ పరీక్షలోనే- పాపాలన్ని పారిపోవాలి.
కష్టాలొస్తే- దేవతకెన్నో- మొక్కులు యిస్తారు
ఆ కష్టాలన్ని తీరిపోతే- మరచిపోతారు.

(శ్రీ తలపల సీతారామయ్యకు అభినందనలతో)

రండీ పుణ్యాత్ములారా- వల్లూరమ్మను
సేవించుటకు– రండీ ధర్మాత్ములారా.
రండీ- మన మందరము వల్లూరమ్మను సేవిద్దాము
వల్లూరమ్మను సేవించి– వరాలను పొందుటకు ॥రండీ॥
పావన గంగలో స్నానము చేసి
హృదయములోని మలినముకడిగి

పండ్లు పువ్వులను చేతనుబట్టి
నిండు మనస్సుతో పూజించుటకై ॥రండి॥
మంత్ర తంత్రములు మార్మోగంగా
భక్తి గీతములు ఆలాపించగా
ముక్తిని బడసి మోక్షము పొందగా
అమ్మ సన్నిధికి అందరు గూడి ॥రండి॥
సకల సంపదలు ఉన్ననుగాని
చివరకు మిగులును కట్టె మాత్రమే
వట్టిదేహమును వదలకముందే
వల్లూరమ్మను చేరి తరించుటకు ॥రండి॥
సంసారములో సుఖములేదు
సంపాదనలో ఆశలేదు
పాపకూపములో పడిపోకుండా
వల్లూరమ్మను చేరి తరించుటకు ॥రండి॥

(శ్రీ మాదాల రామయ్య (హోటల్) అభినందనలతో)

నాలో నున్న- వల్లూరమ్మకు- నమస్కరిస్తున్నా
ప్రార్థనలసియెడి- పూవులతోటి పూజలుచేస్తున్నా.
మల్లెల మాలను బాగుగగట్టి- మెడలో వేస్తున్నా
పాపాలన్ని తొలగేటట్లు- భజనలు చేస్తున్నా.
కామ క్రోదమద మాత్సర్యాల్— అరికట్టకయున్నా
నామములో— నీ రూపము చూచుచు—సంతసపడుచున్నా.
నాలో జరిపే నాట్యములన్నీ- గాంచుచునే యున్నా
కనులు మూసుకొని- కదలే కదలిక చూచుచునే వున్నా.
నన్ను మించినా- నాలో శక్తిని- ఇప్పుడే కనుగొన్నా
తల్లిని తల్లి- వల్లూరమ్మకు- శరణమే శరణన్నా

శరణన్న వారిని–వల్లూరమ్మ– కరుణించి-కాపాడు
మా కల్పవల్లి- వల్లూరమ్మ- వెంటుండి- దీవించు.

(బాపనపల్లి ఆదిలక్ష్మమ్మగారికి అభినందనలతో)

కలగంటిని- కలగంటిని
కలలోన- వల్లూరమ్మను-కనుగొంటిని.
వేయికనులతోడ- వెలుగొందు మా తల్లి
వినయముగా అరుదెంచి- కరుణించినటుల
మోమున చిరునవ్వు- ముద్దులొలుకుచునుండ
మధురముగ నాతోటి- మాటలాడి నటుల
నేను కోరిన కోర్కెలు--వల్లూరమ్మ దీర్చ
నా శిరమున- కరముంచి- దీవించినటుల
తల్లి పాదములంటి- మెల్లగా మ్రొక్కిన నాకు
తల్లి దర్శనమిచ్చి- మమ్ము బ్రోతుమని చెప్ప
తల్లి స్పర్శతో నేను- కనులు తెరచి చూడ
కనులముందర నేడు- వల్లూరమ్మ కన్పించే.
పసుపు కుంకుమలతో– పట్టువస్త్రములతోటి
దగదగ మెరయుచు-నన్ను- ధన్యునిగాచేసె.

ఓం శక్తి—ఓం శక్తి—ఓం శక్తి ఓమ్
ఓం శాంతి– ఓం శాంతి ఓం శాంతి ఓం.
ఇచ్ఛా శక్తి- పారా శక్తి వల్లూరమ్మా
జ్ఞానశక్తి- దివ్యశక్తి వల్లూరమ్మా.
తల్లి వలన- జగములన్ని సృష్టి చెందెను
సృష్టిచెంది- తల్లివలన వృద్ధిపొందెను.
ఆదిశక్తి మూర్తులకు ముక్తి కాంత

మూర్తులందరు దేవినెప్పుడు వేడుచుందురు.
ఆమె కరుణ తప్పకుండా అంత్యమందునా
అట్టిదేవిని పట్టుకొని, నమ్మి కొలవండి.
అమ్మా-అమ్మా చూడండి- పచ్చలమందిరమదిగోను
వల్లూరమ్మా కూర్చుంది- భక్తుల పాలన చేయుటకై.
మునిముని నవ్వుల— ముద్దులొలుకుచును
ముగ్గుర మూర్తుల- యీ తల్లీ
చంద్ర వందన పూబోణి- వరాలతోను వచ్చింది
భక్తులముందర నిలచింది.
అర్ఘ్యపాద్యా అభిషేకములు— అమ్మవారికి సేయండి
నైవేద్యములు- తాంబూలములు-వరుసగా తల్లికి ఇవ్వండి.
నీ రాజనమున తల్లిని యిప్పుడు-సంతోషింప చేయండి
దీవేనలివ్వగ వచ్చింది దీర్ఘాయురస్తు అంటుంది.

(బి. లక్ష్మి కుమారి గారికి అభినందనలతో)

## ఈశ్వరీ! నిన్నే నమ్మితీ! (బ్రహ్మంగారి తత్త్వం)

వల్లూరమ్మా! నిన్నే నమ్మితి- భూలోకమాతా
వల్లూరమ్మా- నిన్నే నమ్మితీ.
వల్లూరమ్మా నీవుగాక- మోక్షమివ్వనెవరివళమూ
సాక్షివట్టి- నిన్ను నేనొక-దీక్షచే సాధింతునమ్మా
చూపులోన రూపమాయె- చూపురూపు ఏకమాయె
పాపలనడుమను వెలిగె- పరంజ్యోతివి వల్లూరమ్మా.
మూడు మూర్తులకు నీవు -మూలమైన దేవతనుచును
నా మనంబున వల్లూరమ్మను- మానకను పూజ సేతు,

భక్తకోటి జనులకు- ముక్తియిచ్చిన వల్లూరమ్మావు
శక్తిరూపము దాల్చి నీవు- భక్తుల రక్షించు తల్లీ.
ఇన్ని మాటలేల నాతో- కోర్కె తీర మోక్షమిచ్చి
సచ్చిదానందమున వెలిగె– సన్నిధిలో వల్లూరమ్మ.
వల్లూరను పురములోనా- మందిరమున వెలసియుండి
ఎందరో భక్తులను నీవు- నీ సన్నిధికి రప్పించుచుంటివి
అందరిని దీవించి నీవు- ఆనందముతో పంపుచుంటివి
అందుకే నీ సన్నిధికిచేరి- వేడుచుంటిని వల్లూరమ్మా

(శ్రీ నిడమానూరి కొండయ్యకు అభినందనలతో)

సాయంకాలం సమయంలో-సంధ్యాదీపారాధనలో
వచ్చెను తల్లి వల్లూరమ్మ–వచ్చింది తల్లి వరాల అమ్మ
మము కరుణించే మాయమ్మ–మము దీవించే మాయమ్మ
మము కాపాడే మాయమ్మ-మము కడతేర్చును మాయమ్మ
పాల సముద్రుని పుత్రికగ-పరాంధాముని ప్రాణ సఖి
రావమ్మ ఇక రావమ్మ-మము దయ చూడగ రావమ్మ
సిగలో ఎన్నో పువ్వులూ–మెడలో ఎన్నో హారాలు
నవ్వుచు వచ్చును మాతల్లి–మము దీవింపగ మాయమ్మ
ధనమును యిచ్చె-ధనలక్ష్మి–ధాన్యము నిచ్చె ధాన్యలక్ష్మి
వరముల నిచ్చె వరలక్ష్మి-కాపాడు దేవత ధైర్యలక్ష్మి
రాజ్యము నిచ్చె రాజ్యలక్ష్మి-విద్యను యిచ్చె విద్యాలక్ష్మి
సంతాన మిచ్చె-సంతాన లక్ష్మి-విజయము నిచ్చె విజయలక్ష్మి.

(జాపన పల్లి సీతారావమ్మ అభినందనలతో)

వల్లూరమ్మా చల్లని తల్లివి
భూలోక మాతవు నీవమ్మా
భక్తుల పాలిట దయగల తల్లివి
భయములు తీర్చగ రావమ్మా!
నీ దయ లేనిచో మా బ్రతుకంతా
జీవితమంతా చీకటి మయము
నిత్యము నీ పాద శరణములే
నమ్మితిమమ్మా వల్లూరమ్మా!
అఘములు బాపె జననివిగ
భయములు తీర్చే తల్లివిగా
బాధలు బాపి వరముల నొసగి
చల్లగా చూడుము వల్లూరమ్మా!
అందుకోవే మా ప్రార్థనలూ
మమ్ము లాలించే తల్లివిగా
శుక్రవారము నీ పూజలను
శ్రద్ధగా మేము చేసితిమమ్మా
శక్తిని యిచ్చి ముక్తిని ఇడని
చల్లగా మమ్ముల కాపాడమ్మా

(శ్రీ బడితల వెంకట రమణయ్యకు అభినందనలతో)

దయగల తల్లివి వల్లూరమ్మా
చల్లగ మమ్ముల బ్రోవమ్మా
నీవు తప్ప మరి ఎవ్వరు లేరని
మదిలో తలచితి ఓయమ్మా
కన్నులుండి మరి గ్రుడ్డివాడినై
నిన్ను గానక తిరిగితినమ్మా
మూర్ఖుడినై నేనింతకాలమూ
తప్పుత్రోవలో నడిచితినమ్మా
నా తప్పులు నీవు క్షమియించి
నీ సన్నిధి నన్ను చేర్పించి
నా బాధలు గాధలు వినవమ్మా
నను ఆదరించి మరి బ్రోవమ్మా
క్షుద్రశక్తివో భద్రకాళివో
ఆదిశక్తివో పరాశక్తివో
సృష్టికి మూలము నీవమ్మా
నీ భక్తుల బ్రోవగ రావమ్మా

(మద్దిపాడు నట్టె ప్రసాద్ పంతులుగారికి)

# చల్లని రాజా-ఓ చందమామ (ఇలవేల్పు)

చల్లని తల్లీ వల్లూరమ్మ
మనసార నిను నేను ధ్యానింతునే
తల్లి పూజింతునే ॥చ॥

నిను చూచిన నా మోము వికశించును
నిను పూజించు భాగ్యమ్ము నా కివ్వవే
నిను సేవింతునే నను దయ చూడవే
నా బంగారు తల్లీ వల్లూరమ్మా ॥చ॥

నా బ్రతుకంత బాధల మయమాయనే
ఈ దీనుని భయమును తొలగించవే
ఈ చిరు చీకటి నా పాలిట శాపమటే
ఓ వెన్నెల వెలుగును కలిగించవే ॥చ॥

నా బాధలగాధలు వినిపించెద
ప్రతి యేడు నీ సేవ నే చేసెద
జన్మ జన్మలకు నిను మరువనులే
నా బంగారు తల్లీ వల్లూరమ్మ ॥చ॥

(తలపల ధనమ్మ & జయమ్మగారికి అభినందలతో)

మా జన్మ యింతేనా బ్రతుకంతా అమావాస్య
ఎన్నాళ్ళు యీ బ్రతుకు అందాల వల్లూరమ్మా

వేదనతో బాధలతో వచ్చాము నీ దరికి
కోరికలు కోరములే కష్టములు తీర్చమ్మా
గుండెలలో బాధలను కలిగించే నర జన్మ
బాధలతో నలిగితిమి వేదనతో వచ్చితిమి
కొండంత ఆశలతో నీ అండ చేరితిమి
బాధలను తొలగించి శుభములను కలిగించు
కన్నీరు కార్చామే కరుగదా నీ మనసు
కడవరకు మా జన్మ సతమతమై నలిగేనా
జపములు రావమ్మా తపములు లేవమ్మా
నీ నామ స్మరణమునే చేసేదము భాగ్యముగ
ప్రతి ఏడు నీ సేవ మండలము చేసేదము
జ్ఞానమును రగిలించి మనసార దీవించు.

(మిత్రులు S. D. ఇస్మాయిల్ గారికి)

కనుపాప కరువైన-కనులెందుకో
తనవారు పరులైన-బ్రతుకెందుకో

# గంగమ్మ తల్లి

శ్రీదేవి గంగమ్మ రా వేగమే
నీ సేవలను చేయ వచ్చి యుంటివి
తల్లి వచ్చి యుంటివి

ఫలములతో పుష్పములతో సేవించగ
మా కోర్కెలన్నీ నీవు నెరవేర్చగ
దయ తోడ మముగాచి రక్షింపుమా
తల్లి రక్షింపుమా

రాగ తాళ భజనలలో కీర్తింపగా
హృదయంబులో నీవు పులకింపగా
మై మరచి యున్నట్టి మముగావుమా
తల్లీ మము గావుమా

వల్లూరు చెంత నీవు వెలసితివి
భక్తుల మదిలోన నిలచితివి
గ్రహ బాధలన్నిటిని తొలగించుమా
మము కరుణించుమా

పుడమిలో వల్లూరు పురమందునా
నరసింహం సమకూర్చు పాటలందునా
తప్పులున్న నను గాచి కాపాడుమా
రక్షింపుమా

(మద్దిపాడు నట్టి కొండమ్మగారికి అభినందలతో)

# పరుగున రావమ్మా-పోలేరమ్మ

అందరు గూడి భజనలు చేస్తే
ఎందుకు రాదు పోలేరమ్మ
మనసున తలచి మరి మరి వేడితే
తప్పక వచ్చును పోలేరమ్మ
బ్రహ్మంగారు అమ్మ అనగా
నిప్పును తెచ్చి యిచ్చెకదా
ముక్కున వ్రేలు తీసి మతి
వేశ్యకు మోక్షము యిచ్చెకదా
దుష్టమానవుల దర్పము అణచి
భక్తుల బాధలు తీర్చెకదా
కోరి భజియించిన భక్తుల కెల్లను
కోరిక లొసగెను పోలేరమ్మ.
ముదము మీరగ–ముజ్జగములను
మురిపెములోనా-సృష్టించి
లాలనచేసి–పాలన చేయుచు
రక్షణచేయుచున్నదిగా
భక్తితో పూజలు చేసేదము
నిరతము మదిలో తలచెదము
పరాకు సేయక–మాపైనీవు
పరుగున రావమ్మా పోలేరమ్మ.

(మద్దిపాడు మహాలక్ష్మమ్మగారికి భక్తి శ్రద్ధలతో)

# ఆరగింపు

ఆరగించు వల్లారమ్మా—అమృతఫలములు
హాయి మీరగాను—నీవు ప్రేమమీరగాను.
వడపప్పు—పానకంబు—వల్లారమ్మానికూ
ప్రేమతో తెచ్చినాము-ఆరగించి పోవమ్మా.
పాలు-మీగడ-వెన్న—పంచదార పాయసంబు
కడువేడ్క తెచ్చినాము—ఆరగించి పోవమ్మా.
పొంగలి-పులిహోరాలు—కమ్మనైన వంటకాలు
భక్తితో తెచ్చినాము—ఆరగించిపోవమ్మా,
ఉలవపాడు మామిడిపండ్లు—కలకత్తా జామపండ్లు
కడు వేడ్కతో తెచ్చినాము-ఆరగించి పోవమ్మా.
కదలీ ఖర్జూరములు-కానుకలు తెచ్చినాము
కడు వేడ్కమున మీరు-గైకొని పోవమ్మా.
పసుపు కుంకుములతో-పలురకాల భక్తులందరు
నీ సన్నిధిలో నిలచియుండిరి-పూజలందుకొనుమా.
ఏమియు తెలియనట్టి-దీనులమైతిమి తల్లి
తప్పులు ఉన్నచో-ఒప్పులుగా భావించుమా.

(మద్దిపాడు శ్రీ ఆదిమూలం సుబ్బారావు దంపతులకు అభినంద
నలతో.)

# మంగళ హారతి

హారతి గైకొనుమా-
మంగళ హారతి గైకొనుమా.
అమ్మలగన్న వల్లూరమ్మా
జయ హారతి గైకొనుమా. శుభహారతి-

ఆపద మొక్కుల అమ్మవు నీవని
ఆదరించి మము బ్రోచెదవని
విశ్వాస భక్తితో నిను వేడుచును
మంగళ హారతి అర్పించితిమి. హా॥

కలియుగంబున కల్పతరువై
వల్లూరమ్మగా వెలసిన తల్లీ
ఎల్లజనులను కాపాడుదువని
మంగళహారతి మరిఇచ్చితిమి హా॥

ధర్మము తప్పక చరించువారికి
ధన ధాన్యములను కలిగించుచును
గాలి ధూళి సోకినవారికి
అభయము యిచ్చి దీవించుచును. హా॥

కొలచిన వారికి-కొంగుబంగారమై
పిలచిన వారికి-పలికేదైవమని
హారతిలిచ్చి-వేడుచుంటిమి.
మా బాధలు తీర్చగరావమ్మా.

(వక్కలగడ్డ సుబ్బరత్నమ్మగారి అభినందనలతో)

# జోల (లాలీ) పాట

అమ్మలగన్న అమ్మవునీవు–వల్లూరమ్మ లాలీ
చల్లని తల్లి వల్లూరమ్మా-నిదురపో లాలీ
ఉదయమునుండి రాత్రి వరకు వల్లూరమ్మా లాలీ
భక్తుల కోర్కెలు తీర్చియుంటివి-నిదురపో లాలీ
అలసి సొలసిఉన్నావమ్మా–వల్లూరమ్మా లాలీ
ఆనందంగా నిదురపో-వల్లూరమ్మా లాలీ
వచ్చేపోయె లాలీధ్వనులకు వల్లూరమ్మా లాలీ
నిద్రభంగం కలుగునేమో-నిదురపో లాలీ.
మహిమలుగల్ల తల్లివమ్మా వల్లూరమ్మా లాలీ
మా కోర్కెలు తీర్చావమ్మా-నిదురపో లాలీ
కల్పవల్లి వల్లూరమ్మా గాపాడితివి లాలీ
వేకువజాము వచ్చేదాక–అదమరచి నిదురపో.

(వాగిచర్ల వెంకటరత్నంగారికి అభినందనలతో)



## సంపాదకుడి సందేశము



ఈ పుస్తక రచయిత శ్రీ టి. నరసింహారావు నాకు మిత్రులు. ఉత్తమ గ్రంథపాలకులు. బహుగ్రంథకర్త.

ఆయన శ్రీ పల్లారమ్మ చరిత్ర వ్రాస్తున్నాను. "ఆధ్యాత్మిక చింతన, పలు సేవా కార్యక్రమములలో పాల్గొనుచున్న మీరు తగిన సహకారము అందించవలసినది"గా నన్ను కోరియున్నారు.

పూర్వీకులు చెప్పుకొను శ్రీ పల్లారమ్మ చరిత్ర, పుస్తక రూపంలో ప్రచురించినచో ముందుతరాలవారికి ఆదర్శముగా నిలవగలదనీ తలంచి, కొందరు పెద్దలతో పరిచయము కలిగించాను.

వారు విసుగు విరామము లేకుండా అవకాశమున్నంతవరకు తిరిగి అమ్మవారి చరిత్రను సేకరించారు. వారికి కృతజ్ఞతలు. కొంత ఆర్థిక సహాయమందించిన శ్రీ బెజవాడ వెంకటేశ్వర్లుగారికి అంకితము చేయుట జరిగింది. ఈ విషయములో సహకరించిన పెద్దలందరికి "తల్లి కరుణా కటాక్షములు" కలిగించాలని ప్రార్థించుచున్నాను.

పల్లారు

1-8-1992

భవదీయుడు

ఎ. కోటేశ్వరరావు [టీచరు]